ఖొకసతిగేహసీమఁ దన
యుం గృత లాలన మాచరించు నొం
డొకసతికిం గృహోపకర
ణోత్కరముల్ ఘటియించు నర్మిలిన్. 109

సీ. ఒకయింటఁ బుత్త్రిని నుపలాలన మొనర్చు
నొకయింట భోజనయుక్తి నొనరు
నొకయింట సుతవివాహోద్యుక్తిఁ ద్రిమ్మరు
నొకయింట మధుమధురోక్తిఁ దనరు
నొకయింట గానరసోత్సాహరసికుఁ డౌ
నొకయింట సుఖనిద్ర నొనరఁ జేయు
నొకయింట సద్వ్రత ముముక్షుపోషకు నాఁడు
నొకయింట సద్గోష్ఠి * నోలి మెలఁగు
షోడశసహస్రయువతులతోడ నిట్లు
క్రీడలాడుచు నుండె నా కేశవుండు
తన్మహాతత్త్వ మెఱుఁగంగఁ దరమె కమల
జాదిసురవరులకు సనకాదులకును. 110

క. ఈపావనకథఁ జదివిన
నోపికతో వినిన శుభసమున్నతి గలయున్
పాపసముచ్చయ మణఁగున్
శ్రీపతికారుణ్య మెలయు క్షితి మనుజులకున్. 111

---

* నోలి మెలంగు—పాఠాం.

సీ. అంత బాణాసురు నని గెల్చి తత్పుత్త్రి
యగునుషాకన్యక నర్హసరణి
నాత్మపౌత్త్రుండైన యనిరుద్ధునకుఁ బెండ్లి
గావించి యట ద్వారకాపురమున
నక్రూరవసుదేవహలధరోద్ధవముఖ్య
హితవృద్ధజనపురోహితసమేతుఁ
డై సుధర్మాఖ్య సభాంతరాళంబునఁ
జెలఁగి సింహాసనాసీనుఁ డగుచుఁ

గొలువు గూర్చుండి కవిబుధగోష్ఠి నలరు
నాయదూత్తముఁ బుండరీకాక్షుఁ జూడ
నమరనాయకుపనుపున నరుగుదెంచె
నారదుఁడు గానవిద్యావిశారదుండు. 112

క. ఆనారదునకు వైద
ర్భీనాథుఁడు పూజ యాచరించినఁ బ్రీతుం
డై నుతియించి పదంపడి
యానిర్జరపాని యిట్టు లనియె మృదూక్తిన్. 113

తే. దేవ శిశుపాలునాజ్ఞచే ద్విజులు మఖము
లాచరింపక దుర్మార్గు లైనకతన
క్షుత్పిపాసార్తిఁ గలఁగిరి సురగణములు
తత్పురోడాశభుక్తిచేఁ దనర లేమి. 114

తే. దేవ పంచమహాయజ్ఞతృప్తి లేమి
నఖిలమునిపితృసుర లనాహారకలన
సలఁగిరి ద్విజాళి స్నానసంధ్యావిహీను
లగుచు శ్రుతిస్మృత్యుక్తవిధదూరు లగుటఁ జేసి. 115

క. భూదేవకర్మముల బ్ర
హ్మాదిసురలు తృప్తినొంది యతులితజవస
త్త్వాదిసమన్వితులై రో
గాదు లడఁగి దీప్తదేహు లగుదురు కడిమిన్. 116

ఉ. బాలిశబుద్ధి యైన శిశు
పాలుఁడు వేదవిరుద్ధకర్ములన్
లాలన మాచరించి మద
లంపటవృత్తి మెలంగు దాన దే
వాలయదేవతాప్రతిమ
లర్చ యొనర్చుజనంబు లేమి బ్రా
హ్మలి మహిం బడెన్ ద్విజా ల
మాన్యత నొందిగ కర్మహీనులై. 117

వ. కావున నప్పాపాత్ముని సంహరించి లోకంబులు రక్షింపు
మని పురందరసందేశం బెఱింగించి యద్దివ్యముని వెం
డియు నాకలోకంబునకుం జనియె నంత నమరసభామ
ధ్యంబున నున్న పాండురాజతని కిట్లనియె. 118

తే. ఓమహాత్మ యుధిష్ఠిరభీమవిజయు
నకులసహదేవనాములు నాదుసుతులు
నున్న శతశృంగపర్వతమున వసించి
రిపుడు వా రెచ్చటికిఁ జని రెఱుఁగఁజెపుమ. 119

వ. దేశాంతరగప్రాప్తుఁడ నయ్యుఁ బుత్త్రమోహంబుఁ దొ
లంగఁజాలకున్నవాఁడఁ గావునం దద్వృత్తాంతంబుఁ
దెల్పు మనుటయు నారదుం డిట్లనియె. 120

సీ. నీతనూజాతు లవారితోరుముఖ్యు ల
నూనసంయమిసేవ్యమాను లగుచు
జనసేవమేతులై శతశృంగగిరినుండి
శరిపురి కేతెంచి శరము వేత్క
సురసరిత్తనయవిదురలాలనంబుఁ జేఁ
గురుకుమారులతోడఁ గూడి క్రీడ
లాడుచు నుండి రయ్యవసరంబున వారి
లందఱిలోపల ననిలనందనుఁడు
బలయుతుం డౌటఁ గాంచి సౌర్యుఁడు దలంచి
వ్యాళములచేతఁ గఱపించి క్ష్వేళ మిడియుఁ
గృష్ణరక్షితుఁ డగువాని గెలువలేక
యాత్మలోఁ గుందె ధార్తరాష్ట్రాగ్రజుండు. 121

వ. ధృతరాష్ట్రుండును బుత్త్రమోహంబున దుర్యోధనుఁడు
సేయుకృత్యంబులు నివారింపఁడయ్యె నంతఁ గృపాచార్యు

నొద్ద రాజకుమారు లందఱు విలువిద్యఁ గఱచుచునుండి
రయ్యెడ. 122

ఉ. పాండవకౌరవాఖ్యులు
పట్టణబాహ్యవనాంతరంబునం
గందుకకేళి సల్పునెడఁ
గాంచనరత్ననిబద్ధమైన యా
గందుక మొక్కనూతఁ బడఁ
గాంచి తదుద్ధరణం బొనర్చె ద్రో
ణుం డను విప్రముఖ్యుఁడు ధ
నుష్కలితోరుపృషత్కపంక్తులన్. 123

ఆ. వేదశాస్త్రముఖ్యవిద్యాన్వితుని ధను
ర్వేదవిదుని ద్రోణు నాదరించి
భీష్ముఁ డాత్మపౌత్త్రబృందంబునకు నెల్ల
కార్ముకాదివిద్యఁ గఱపఁ బనిచె. 124

చ. అతఁడును రాజసూనులకు
నందఱకున్ వివిధాస్త్రశస్త్రసం
తతు లుపదేశ మిచ్చి ప్రథ
నప్రతిబాధ్యులఁ జేసి యంత ను
ద్ధతబల*వంతుఁ డైనద్రుపద
దక్షితిపాలకుఁ బట్టి తేర నం

*బుత్తు — పాఠాం.

చితగతిఁ బంచె వీరభట
సింధురసైంధవబంధుకోటితోఁ. 125

తే. తొల్లి తను నవమానించె ద్రుపదుఁ డనుచుఁ
బగ మనంబున నిడి వానిఁ బట్టి తేర
గురుఁడు పనిచినఁ బాండవకురుకుమారు
లందఱుఁ దదాజ్ఞఁ దలమోచి యరిగి రంత. 126

వ. ద్రుపదభూనాథురాజధానియైన కాంపిల్యనగరంబునకుం
జని యతనితోఁ బవరం బొనర్చి కర్ణసహితంబుగాఁ
బరాజితులై మరల నరుగుదెంచి రంత నర్జునుం డొక్క
రుండును ద్రుపదుం బట్టి తెచ్చుటకుం బ్రతిజ్ఞచేసి చని
వానితో మహాయుద్ధంబుచేసి నోడించి చేదోకీలు గట్టి
గురునకు దక్షిణగా నిచ్చిన. 127

సీ. గురుఁడును ద్రుపదుఁ గన్గొని యుల్లసములాడి
విడిచిన నప్పు డప్పుడమిఱేఁడు
కడు లజ్జితుండయి కాననంబున కేఁగి
యచట దుష్కరతపం బాచరింప
హరుఁడు ప్రసన్నుఁడై యడుగుము వర మన్నఁ
గుంభసంభవు గెల్చు కొమరు నొకని
నర్జునునకుఁ బత్ని యగుపుత్త్రి నొక్కతె
నడిగి తద్వరమున ననలకుండ

మున జనించు ధృష్టద్యుమ్నుఁ డనుతనూజుఁ
గృష్ణ యనుకన్యఁ గాంచి పాంచాలపతిశి
ఖండి యయ్యె నయ్యింద్రతనయు బావమఱఁది
యంబుఁ గొనియాడి రఖిలజనంబు లుర్వి. 128

చ. కరిపురవాసు లందఱును
కర్ణసుయోధనముఖ్యులం దిర
స్కరణ మొనర్చి యర్జునుని
సాధితసద్గురుకార్యశౌర్యధీ
గరిమ నుతింపఁ జొచ్చిరి ని
కామముదన్వితచిత్తవృత్తులై
కెరలిన వీఁడు నన్నయిన
గెల్చు నటంచుఁ దలంచె ద్రోణుఁడున్.

క. సురసరిదాత్మజుఁ డపు డ
న్నరునిభుజాబలమునకు మనంబునఁ దగ న
చ్చెరు వంది నాదుపిమ్మట
నరిసూదనుఁ డితఁడె యనుచు నభినందించెన్. 130

ఉ. ఈవిధి నింద్రసూనుఁడు నుతి
యింపఁగఁ గర్ణసుయోధనాదియో
ధావళి సిగ్గుచెంది పరి
తాపముఁ గూరఁ దృష్టికాష్టమేఁ డన

త్యావిలచిత్తులై తెలుప
నాతఁడు పుత్రిమతానువర్తియై
భావమునం దలంకి యట
పాండుతనూజులఁ జీరి యిట్లనున్. 181

ఆ. భూరితేజులార వారణావతపుర
వరమునకును మీర లరుగుఁ డదియు
నఖిలవైభవాఢ్యమై సస్యసంపూర్ణ
మగుచు ధర్మకృజ్జనాప్తి నలరు. 182

మత్త. వారణావతపట్టణంబు నివాసయోగ్యము మీకు నో
ధీరవిక్రములార మీర లతిత్వరం జని యందు నిం
పారఁ దద్ధితరాజ్యపాలనమాచరింపుఁడనంగ న
వ్వీరు లప్పురి కేఁగి రక్కురువీరమన్ననియామకిన్. 183

సీ. అపుడు సుయోధనుం డతికలుషాత్ముఁడై
శకునికర్ణదుశ్శాసనాది
మంత్రిదుర్మంత్రినిమంత్రణ వారణా
వతపట్టణంబున జతుగృహములు
రచియింపఁ బనిచె నారాజన్యు లయ్యిండ్ల
నేమఱియున్న దహింపఁదలఁచి
యంత నప్పాండవు లాలక్కయిండ్లలో
నధివసింపఁగ విదురానుమతిని

ఖనకుఁ డొక్కఁడు ధర్మజుకడకు *వచ్చి
క్రోధకీలితుఁ డైన దుర్యోధనుండు
సేయుదుర్మంత్ర మంతయుఁ జెప్పి వారు
వెలువడఁగ నొక్కబిలము గావించె నచట. 184

వ. కృష్ణాంగారకచతుర్దశినాఁటి నడురేయిఁ దద్బిలద్వారం
బున జననీసహితులైన పాండవుల వెలువరించి ఖనకుం
డరిగెఁ దదనంతరంబ యాలాక్షాగారంబున వారలు
నిద్రించియున్నవార లని తలంచి. 185

చ. తొడరి సుయోధనప్రహిత
దూతజనంబులు తద్గృహంబు లు
బ్బడర దహించి రట్టి తెఱఁ
గారసి పౌరులు సంభ్రమించి య
జ్జడమతు లైన సూతసుత
సౌబలకౌరవనాథముఖ్యులం
గడుకొని నిందసేయుచు ని
కామశుగార్తిఁ గలంగి రయ్యెడన్. 186

ఆ. అయుతదంతిసత్త్వుఁ డనిలతనూజుఁడు
నడువలేక నిదుర జడత నొందు
సోదరులను దల్లి నాడట మోచుక
యరిగెఁ జీకటనక యతిరయమున. 187

---

* కడకి—పాఠాం.

చ. అనిలసుతుండు గండున మ
హావిపినంబున వీతభీతుఁడై
యనిలజవంబునన్ శ్రమము
నాఁకలి దప్పియుఁ జెంద కేఁగెఁ దాఁ
జనునెడ నూరువేగహతి
సాలలతావళి విఱ్ఱిగ్గి డిగ్గనం
బొనుఁగువడం బదాహతుల
పొందునఁ బ్రిస్తరపంక్తి నుగ్గుగన్. 138

తే. ఇట్లు యామద్వయంబున నిరువదేను
యోజనంబులుం గడచి సూర్యోదయావ
సరమునం దొకవటతరుచ్ఛాయ డించె
నన్నదమ్ములఁ దల్లి నయ్యనిలజుండు. 139

ఉ. అంత హిడింబ నాఁగ నొక
దానవకామిని యేఁగుదెంచి దు
ర్దాంతబలాఢ్యు భీము నవ
తామరసాయతచారులోచనుం
గంతుమనోహరాంగుఁ గని
కాంతవకుంతనివీడిశాంగియై
చింతఁ గలంగి యాయనకుఁ
జేతులు మోడ్చుచు నల్ల నిట్లనున్. 140

సీ. అనఘ యివ్వని హిడింబాసురుం డనునొక్క
దనుజవరుఁ డెలమి నాయగ్రజుండు
భక్షణార్థము మిమ్ముఁ బట్టి తెచ్చుటకు న
న్ననిచిన నిచటికి నరుగుదెంచి
నవయౌవనాంగుఁ గందర్పప్రతీకాశ
లావణ్యగణ్యవిలాసకలితు
నినుఁ గాంచి మోహించి నిలిచితి నాదుప్రా
ణంబులు నీయధీనములు చేసి
కావున మనోజబాధితఁ గావు నన్ను
నిప్పు డాక్రూరదానవు నేపడంచి
కాననస్థలి నిష్కంటకప్రసిద్ధిఁ
దనరఁ జేయుము నీకు భద్రంబు లొదవు. 141

వ. అని పల్కునెడ. 142

ఉత్సా. అనుజ రాక మసలె ననుచు నసుర గినిసి దాని న
మ్మనుజవరుల నొక్కపెట్ట మన్నిగొనఁగఁ జేర న
య్యనిలసుతుఁడు వానిఁ దాఁకి యతులముష్టిఘాతుల న
ద్దనుజుతోడఁ బోరుసల్పె ధైర్యశౌర్యశాలియై. 143

వ. ఇట్లు కొండొకతడవు ఘోరయుద్ధంబుచేసి. 144

ఆ. అంత ముద్గరాభిహతి దధికరోషంబు
నగుల నడఁచులీలఁ బవనపుత్త్రుఁ

డశనినకల్పముష్టిహతి హిడింబాసురుం
* మస్తకంబు వ్రచ్చి మడిపె నపుడు. 145

క. విజయుం బీగతిఁ గైకొని
విజయాగ్రజుఁ డగ్రజునకు వినతుం డగుచుం
నిజజననియాజ్ఞచే నా
రజనిచరాంగన వరించి రతిఁ గరఁగించెన్. 146

వ. అప్పు డదియును. 147

మ. అచలప్రాంశువిశాలవిగ్రహుని శ
స్త్రాస్త్రప్రవీణాత్ముఁ గా
మచరుం బంక్తిశిరోధసన్నిభు మహా
మాయున్ బలోదగ్రు రా
త్రిచరాగ్రేసరు వజ్రికర్కశతనున్
ధీరున్ గభీరున్ ఘటో
త్కచుఁ డన్ బుత్త్రునిఁ గాంచె భీమువలనన్
దాక్షిణ్యభాగ్యోద్భవున్. 148

వ. అంత. 149

చ. జతుగృహము లబ్ధించి విల
సద్గతి భ్రాతలు బోయి తెల్ప ధ్రు
వ్యతి యగు కౌరవప్రభుఁ డ
వ్యాత్మజులు దానును సంతసిల్లెఁ బ్రీ

* మస్తకం బగల్చి—పా.

స్తుతమతు లైన పాండునృప
సూనులనేమము విన్కిఁజేసి స
న్మతి విదురుండు సంతసిలి
మాటె మదిం దదుదంత మంతయున్. 150

సీ. అంత వేదవ్యాసునను శాసనమునఁ బ్ర
హ్మాత్మజు ల్విప్రవేషాఢ్యు లగుచు
రహి నేకచక్రపురముఁ జేరి యందొక
భూవిబుధాలయంబున వసించి
వేదము ల్చదువుచు విప్రగేహంబుల
భిక్షము ల్దేర నాపృథయు నందు
సగము భీమున కిడి సగము దా రేవురు
భుజియించుచుండ నప్పురజనములు
భసితసంఛన్నపావకప్రతిము లైన
వారిఁ గన్గొని ధారుణీభారహరణ
చతురమతు లైనదేవాంశసంభవు లని
తలఁచి పరమాన్నభిక్షలఁ దనిపి రెలమి. 151

ఆ. అట్లు భీమసేనుఁ డందఱు దెచ్చిన
సరసభుక్తరాశి పాము దినియు
నుండుఁ దృప్తినొంద కుపవసించినగతిఁ
దుందిలుండు గాన దోఁగు నొంది. 152

సీ. అయ్యగ్రహారంబునందు బకాభిఖ్యుఁ
డసుర యజస్రంబు నవనిసురుల
దినము నిల్వరున నొక్కనిఁ దిను నవ్వార్త
విని పాండవులు వానిఁ దునుమ ననువు
మది విచారించి యొక్కదినంబునందు ని
జావాసదుండైన యవనిసురున
కాబకారాధనం బావశ్యకంబైన
యగ్రజానుజ్ఞచే ననిలసుతుఁడు
విప్రపుత్త్రుని మరలించి వివిధభక్ష్య
భోజ్యములు మెక్కి యన్నసంపూర్ణమైన
శకట మారోహణముచేసి చనియె దనుజుఁ
గడపి భూసురసమితి రక్షింపఁబూని. 153

వ. ఇక్షులామరీచిరామఠసంస్కృతవ్యంజనాన్వితంబును భక్ష్య
పూర్ణంబును నైన యన్నశకటం బెక్కి చని బకాసుర
స్థానంబు చేరి యయ్యన్నంబు భక్షించుచుండె నాసమ
యంబున. 154

తే. రక్కసుఁడు భీమసేను తెఱంగుఁ గాంచి
దండతాడితభోగిచందమునఁ గనలి
దండిహరివాయువులలో నొకండు గాని
యితఁడు మనుజుండు గాఁ డని యిచ్చ నెంచె. 155

యకలంకస్థితికిఁ ద్రిశూలికి నజా
తారాతికిఁ మ్రొక్కి యుం
బకు సమ్మోద మొనర్చి తమ్ములను సం
భావించి నెమ్మిం జగన్. 159

ఆ. ఏకచక్రనగరి నీగతి ద్విజాలకు
హితముఁ గూర్చి వార లెలమి నుండి
రంత ద్రుపదనృపతి యాత్మజాతకు స్వయం
వరము సాటఁ బంచె సరవరేణ్య. 160

తే. అమ్మహోత్సవమునకు రాజ్యమునఁ గల్గు
నరవరేణ్యులు కాంపిల్యనగరమునకుఁ
జనిరి చతురంగవాహినీసహితు లగుచుఁ
దరుణిఁ బరిణయించునాసచేఁ బత్తిఱమున. 161

సీ. కౌంతేయు లేకచక్రాపురావనిసుర
సహితులై విప్రవేషములతోడ
సన్మార్గు లగుచుఁ జనుచు మార్గమ
ధ్యమున నంగారపర్ణాభిధాను
గంధర్వు నిర్జించి కాంపిల్యనగరంబు
చేరి యందొక కుంభకారసదన
మున వసియించి రయ్యావసథములలోన బీ
భత్సునిఁ గాంచి యాబ్రాహ్మణుండు

మఘవసన్నిభుఁ డీతఁ డీమత్స్యయంత్ర
ఛేదనం బొనరించి యీపృథునితంబ
బింబఁ బాంచాలనృపకన్యఁ బెండ్లియాడు
ననుచుఁ బలికిరి తమలోన నార్యజనులు. 162

ఆ. అపుడు ద్రుపదనృపతి యంబరతలమున
యంత్రమత్స్య మొకటి యనువుపఱిచి
తాళతరుసమానధనువును శరములుఁ
జూపి నిఖిలరాజసుతులఁ జూచి. 163

సీ. ఈవిల్లుమోపెట్టి యెవ్వఁడేనియు నేను
మార్గణంబుల యంత్రమత్స్యలక్ష్య
ఛేదనం బొనరించుఁ జేర్మి నాతండె నా
కన్యకు వరుఁ డని కడఁగి పలుక
నృపతు లాకాంతఁ బరిగ్రహింపఁగఁ బూని
యావిల్లుమోపెట్ట నలసులైన
నంత నర్జునుఁ డొకయంబకంబున మత్స్య
యంత్రంబు ఛేదించి యాశుభాంగిఁ
గొనియెఁ దదనంతరమ కర్ణకురుకులేశ
ముఖ్యనృపు లోర్వఁజాలక పొనసి పోర
భీమవిజయులు తద్వీరబృందములఁ బ
రాజితులఁ జేసి యుగ్రతరాజిలోన. 164

ఉ. ఆవిధి గెల్చి యొక్కఫల
మబ్బె నటంచు నరుండు చెప్ప వి
శేషరుఁ బంచికొం డని య
హీనదయామతిఁ బల్కె యంత రా
జీవదళాక్షిఁ గృష్ణఁ గని
చిత్తమునం గడు విన్ననై పృథా
దేవి దలంచె భీముని యు
ధిష్ఠిరునిం గవలం దలంచుచున్. 165

ఉత్సా. భీమబలులు పాండుసుతులు భిక్ష లెత్తి తేర నా
శ్రీమనోజ్ఞవేషఁ గృష్ణఁ జీటి కుంతి యిందులో
సామె భీమున కిడి కడమనగవల నాలుపాళ్ళుగా
నోమి సేయ కునుచుఁ బల్కె నున్నయామ్వరుం డినన్. 166

క. ఆగుణవతియును నట్లు వి
భాగము లొనరించి యిడఁగఁ బవనసుతుం డి
చ్ఛాగతి భుజియించియుఁ దా
నోగిరమున కాససేయుచుండు బుభుక్షన్. 167

ఉ. వీరలు రాజనందనులొ
విప్రులొ సత్వరలీల నేఁగి నీ
వారసి రమ్మటంచు ద్రుప
దావనిభర్త తనూజుఁ బంప న

వీరవరుండు పాండవుల
                    వృత్తము దాఁటునకుండె కాంచి యీ
ధీరులు భూరివిక్రములు
                    దేవసమానులటంచు నెంచుచున్. 168

శా. అన్యవ్యూహాభిదానుచింతనము దా
                    హర్షోత్సాహవిధుల్
జన్యోపాయము నస్త్రశస్త్రనియతుల్
                    జానొందఁ గౌంతేయు ల
న్యోన్యంబు స్ఫురియింపఁ బొంచివిని తా
                    నయ్యామినిన్ వీరు రా
జన్యుల్ భూసురవేషధారు లని ధృ
                    ష్టద్యుమ్నుఁ డెంచెన్ మదిన్. 169

వ. మీావేషంబుల విపరీతత్వంబును భాషావిశేషంబుల రాజత్వంబును దోఁచుచున్నయది యిట్టియమానుషకర్మకరణంబు విప్రజాతికిం గలుగునె ధైర్యగాంభీర్యాదిగుణంబులకతన క్షత్రియు లగుట సిద్ధంబు మీారెవ్వ రని యడిగినఁ బాంచాలనందనునకు ధర్మనందనుం డిట్లనియె. 170

ఆ. ఏను ధర్మజుండ నీతండు భీముండు
వాఁడు విజయుఁ డల్లవారు కవలు
వినుము జ్ఞాతిజనులు వేధింప విప్రరూ
పమున నడవి వచ్చితిమి రయమున. 171

క. అని తమయుదంత మంతయు
వినుపించినఁ బొంగి పాండవేయులఁ దగ నీ
ట్కొని ధృష్టద్యుమ్నుఁడు సని
జనకునకుం దెలిపె వారిచరితం బెల్లన్. 172

మత్త. అరసాంతిలఁ [illegible] జరాభికాంక్షితకార్య ఘ
య్యార్తి నేఁడు ఫలించె సంపదఁ బ్రహర్షితోత్కరుఁడై సౌఖ
వారణాశ్వరథాంగభూషణవస్త్రహాటకశాటికో
దారవస్తువితీర్ణిఁ దన్పెఁ బృథాతనూజుల నర్మితిన్. 173

తే. అంత సర్వజ్ఞుఁ డగుకృష్ణుఁ డానృపాల
మణులు ద్రుపదునిపురి నుండుటయుఁ దెలిసి
యఖిలయాదవనికరంబు లటుల గొలువ
నరిగెఁ బైతృష్వసేయుల గలయఁజేయ. 174

క. హరి పాండవేయులకుఁ గరి
హరిరథమణికనకభూష లర్పించెన్ శ్రీ
వరుకరుణ గలుగునరులకు
నరయ నలభ్య మగువస్తు వవనిం గలదే. 175

చ. అపుడు గృహాగతుం డగుజ
నార్దనుఁ గన్గొని సంతసిల్లి నా
తపము ఫలించె సన్వయము
ధన్యతఁ గాంచె మదీయమందిరం

విభుడు పవిత్రుఁడయ్యెఁ బర
మేశ్వర నీవరుఁడే నటంచు నా
ద్రుపదమహీతలాధిపుఁ డ
దుశ్కాని పూజ యొనర్చి వేడుకన్. 176

శా. విద్వద్వందితుఁ డంబుదాసితమహా
వేషుండు గృష్ణాజినాం
చద్వ్యాసుండు సమస్త వేదపటలీ
శాస్త్రార్థసంభారణా
చిద్విద్యావిభవుండు పింగళజటా
శ్రీభాసురాంసుండు కృ
ష్ణద్వైపాయనుఁ డాప్తధాత్మజులఁ గా
న న్వచ్చె సచ్ఛాటికన్. 177

శా. పారాశర్యమహామునిన్ ద్రుపదభూ
పాలుండు వీక్షించి స
త్కారం బింపుగఁ జేసి నీదుపదప
ద్మశ్రీపరాగాప్తిఁ జే
స్నారం బావనమయ్యె మద్గృహము ధ
న్యం బయ్యె మద్వంశముల్
నీరాకన్ మునివర్య యంచుఁ బొగడ
న్నిర్ణిద్రహర్షోన్నతిన్. 178

కృష్ణమృగశాబలోచనఁ
గృష్ణ నొసఁగఁ బాండవులకుఁ గృప చెలువొందన్. 184

ఉ. ఈవిధి ధర్మజప్రముఖు
లెవ్వరు సౌఖ్యవశేయునాజ్ఞచే
ద్రోవదిఁ బెండ్లి యై ద్రుపదు
ప్రోలి వసింపఁగ నర్తితింగ భా
రావళి చెల్వఁగా విని సు
యాత్మజుఁ డైన సుయోధనుండు చిం
తావిలమానసుం డయి వ
ధాంతరసంస్థితుఁ డై రయంబునన్. 185

క. ద్రోణకృపభీష్మవిదుర
ద్రౌణిశకునికర్ణసోమదత్తశలాద్య
క్షీణప్రాజ్ఞామాత్య
శ్రేణిం గని పల్కెఁ గ్రోధకలితమతి యై. 186

తే. వింటిరే పాండవులు విప్రవేషధారు
లగుచు ద్రౌపదిఁ బెండ్లాడి రహఁగ వింటి
వారిఁ గెల్చునుపాయంబు మీర లర్థి
మద్ధితార్థు లై తెలుపుఁడు మనల కిపుడు. 187

వ. అనిన శాంతనవుం డిట్లనియె. 188

క. కృతపుణ్యులఁ బాండవులం
గృతకమతి న్నిరు సేయుకీడు దవులన్

కృతమగులు యతలోఁ ధర్మ
స్థాపనయు యనంగ వినుమా ధరణినాథా. 189

ఉ. ఎచ్చటఁ బాండవాత్మజు ల
హీనగతిన్ వసియింతు రింపుగా
నచ్చట వర్షము ల్గురియు
నచ్చట భూరుహము ల్ఫలించుఁ దా
నచ్చట భూమి సస్యవతి
యై కడు సొంపగు ధేనుసంఘముల్
నిచ్చలు నచ్చటం బిదుకు
నిర్మలదుగ్ధము లధ్యయస్థితిన్. 190

తే. వితతధనధాన్యసంపద విఱ్ఱవీఁగి
ప్రజలు ధర్మాభినిరతులై బ్రతుకుఁ గాంతు
రఖిలవిప్రులు వేదశాస్త్రానురక్తి
నుండుదురు వారు వసియించునుర్వియందు. 191

సీ. దివిజసన్నిభులు కౌంతేయులు మును సేవ
సేయుకృత్యంబులఁ జిక్కువడిరి
కాంపిలీనగరిలోఁ గలన ద్రుపదునిగతి
గెలువఁడే నృపతులఁ గ్రీడి యొకఁడు
యతనిశౌర్యంబు నీ కగపడినదియె యా
ల్లత్యంతబాహాబలాఢ్యులైన

యమ్మహామహీపులకు హరి మాతులేయుండు
సతతంబు భద్రము ల్సంఘటించుఁ
దత్సహాయంబుకలిమి గంధవహాదిష్ట
హుతవహోగ్రప్రభామహాభ్యుదయతేజు
లైరి పాంచాలపతియుఁ గన్యాప్రదాత
యగుట నుజ్జ్వలగతిఁ దత్సహాయుఁ డయ్యె. 192

వ. మఱియును. 193

మ. నరనారాయణు లాదిమాను లరవిం
దోద్భవప్రార్థనన్
ధరణీభారము వాపఁ బుట్టిరి నితాం
తక్షేమసంశోభితుల్
నరుఁ డప్పార్థుఁడు నందనందనుఁడు నా
నారాయణుం డమ్మహా
పురుషుల్ సౌహార్దవృత్తి వర్తిలుదు రిం
పు ల్మీంపి యన్యోన్యమున్. 194

ఆ. విను మజాతశత్రుఁ డనఘుఁడు ధర్మజుఁ
డతని కహితవీరు లవనిఁ గల్గ
రట్లు గల్గరేని యభివృద్ధి నొందరు
వానిమహిమ పెన్నువశమె చెప్పుమ. 195

ఉ. భీముఁడు భీముఁ డాజుల గ
భీరపరాక్రముఁ డర్జునుండు సం

గాత్రమవిశారదముం దహిత
గర్వితమస్తకనుండు చాపవి
ద్యామహాసియుఁ దదిత్రనిభ
క్షైత్యులు మాద్రిసుతు ల్దలంపఁ దా
నామహితాత్ముల న్మనువు
నచ్యుతుఁ దర్మిలి నెల్లవేళలన్. 196

చ. హరి పరమేశ్వరుండు సఖుఁ
డై నిరతంబును శ్రీద వైభవ
స్ఫురణము గన్నపాండునృప
సూనుల బాధఁ గల్గనేర్చునే
కురుపుల యింతయున్ మనసుఁ
గోరితినేనియు నారిఁ దెచ్చి సు
స్థిరతఁ బొసంగి యుండు నిటు
సేయక తక్కినఁ గీడగుం దుదన్. 197

వ. అని పల్కిన విని యుధరిపడి కర్ణుం డిట్లనియె. 198

ఆ. భీష్మ నీవు ధర్మబృందంబు లెఱుఁగుదు
గాని తెలియఁగ విశదకార్యగతులు
వృద్ధ వగుట నీకు నివి ధర్మములం దెల్పు
వేళ గాని యుద్ధకాల మగునె. 199

క. నీయుద్ధనైపుణియును దా
హాయతశక్తియును గాన వచ్చె నిపుడు కాం

తేయులకు వెఱచితివి నీ
కాయుర్వృద్ధి యగు నింటి కరుగుము వేగన్. 200

చ. వెఱచినవారిమాటలు ని
వేశధురీణులు విందు రెల్లము
న్నొఱుఁగ వె. పాండునందనులఁ
గృష్ణుఁడు నా ద్రుపదుండుఁ దోడుగా
నెఱిఁ జనుదెంచి రేనియును
నే నొకకోలన వారినెల్ల నే
డ్తెఱ నుఱుమాడి సైచెదఁ గ
డింది మగంటిమి యుల్లసిల్లఁగన్. 201

వ. అనిన యుప్పలుకులకుం గనలి కృపాచార్యుం డిట్లనియె. 202

తే. కర్ణ నీ విట్లు వల్కెదె గంగపట్టి
నతనికిని నీకు గిరిసర్షపాంతరంబు
ద్రుపదుఁ బట్టంగ నేఁగిన యపుడు నీదు
శౌర్య మేమాయె కరిగె నిజంబు సెప్పుమ. 203

వ. నరపాలపరిషన్మధ్యంబునం బెద్దలం బరిభవింప వలంతివి
గాని సంగ్రామరంగంబునఁ బలాయితుండవు గాక ధనుః
కౌశలంబు వెల్లడిసి నిలువంగలిగితివే యని పలికినం
గ్రోధించి దండహతాశంబుగతిఁ గోపించి కాగినుం డిట్లనియె..

ఆ. భూమిసురుఁడ వీ వపూర్వపక్రియుండవు
గలదె సభల నీకుఁ గార్య మొకటి.

కోరు ఖడ్గధారఁ గువలయాధీశ్వరుఁ
డాజ్యధారఁ గోరు నవనిసురుఁడు. 205

మత్త. బాలు డాతఁడు వృద్ధు వృద్ధునిఁ బ్రస్తుతించుజగంబునన్
బాల వృద్ధుఁడ వౌట నీగతి సంస్తుతించితి భీష్మ నీ
బాలిశత్వము దెల్లమయ్యెఁ గృపా నృపాలసభాస్థలిం
జేరి చేత తలంగు నీకిది పిండివంటలరాశినో. 206

క. అని పలుకుసూతసూనునిఁ
గనుఁగొని దండాహతాహి కైవడి గ్రొ
గ్గిన లేచి గాంగేయుఁ డల్లు
దిన నాతనిఁ బల్కెఁ గోపవివశుం డగుచున్. 207

ఆ. వృద్ధసేవ నల్పవిధమును బ్రాజ్ఞత
లేదు నీకు నొక్కలేశ మైన
నోరి! కురునృపాలు ద్వారంబునందుఁ గా
తేయకంబుగీతిఁ గూయు దీట్లు. 208

వ. అని పట్టం బాలవెటికి రాధేయుని వ్రేయఁగమకించిన
దుర్యోధనుండు లేచి కృతాంజలియై దేవవ్రతకుంభసంభ
వాశ్వత్థామకృపాదులకుం బ్రియంబుఁ జెప్పి యాకలహం
బు మాన్చె నంత విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 209

ఉ. నీతివిదుండు గీరుఁ డని
నింద్యచరిత్రుఁడు వృద్ధసేవి వ్రి

గ్రింథస్థైర్యవంబునఁ బు
రంబు వ్రేశెళ నిలునర్చి రాన్నృపుల్. 215

ఉ. ధీయుతు లత్యుదారులు యు
ధిష్ఠిరముఖ్యులు కుంభజన్మగాం
గేయకృపాంబికేయుల క
కృతిప్రియభక్తి నమస్కరించి రా
ధేయసుయోధనాదుల న
తిప్రమదంబున గౌరవించి తా
రాయెడ నుండి రార్యనిచ
యంబనుకంప బహూకరింపఁగన్. 216

క. ఈ తెఱఁగున వారలు కం
జాతాక్షసమేతు లగుచు సభనుండు తఱిన్
నీతివిదుఁడు విదురుఁడు ప్ర
ఖ్యాతఫణితిఁ బలికె నంబికాసుతుతోడన్. 217

సీ. నీతమ్ముఁడగు పాండునృపసుతుల్ సత్యవ్ర
తిజ్ఞులు నీకు విధేయు లుర్విఁ
బ్రాజ్ఞులు ధర్మజ్ఞులు కృతజ్ఞు
లతులపరాక్రము లార్యహితులు
నగుట దజ్జనకాంశ మగురాజ్య మొసఁగి వా
రలఁ గూడి మనుము నిర్వ్యాజకలన

నిది భీష్మగురుకృపకృష్ణముఖ్యులకు స
మ్మతమును ధర్మక్రమంబుఁ దలఁప
గర్ణదుర్యోధనప్రభంజనకలితమై సు
యోధనానల నిరాయుధ్వయోరువిపిన
మంతయు దహించుఁ గావున నయ్యిరువుర
బుద్ధి వినక కౌంతేయులఁ బ్రోవు మనఘ. 218

క. కావునఁ గుంతీసుతులకు
నీ విందప్రస్థనగర మిమ్ము సుఖేచ్ఛన్
భూవర తనయాన్వితుఁడ
వై వెలయుము కీర్తిశోభివై విశ్వమునన్. 219

చ. అని విదురుండు దెల్పుటయు
నాధృతరాష్ట్రుఁడు గుంభజన్మశాం
తనవకృపాదిసజ్జనవి
తానము లుల్లసిలంగఁ బాండునం
దనులకు నర్ధరాజ్యము ము
దంబున నిచ్చె ననంతరంబ యా
యనఘు లశేషబాంధవస
మన్వితులై చని రార్యసమ్మతిన్. 220

క. ఇంద్రవిభవమున నీగతి
నింద్రప్రస్థంబు చేర నేఁగఁగ నదియున్

రుండరిమృగాకీర్ణంబై
సాంద్రలతాగుల్మసాలసంవృత మగుటన్. 221

వ. కనుంగొని ధర్మనందనుండు. 222

మ. ధృతరాష్ట్రుం డతిలోభమోహితుండు గా
లిభాగదానోద్యతి
స్థితి సీకాసన మిచ్చె జ్ఞాతిజను లి
స్సీ జ్ఞాతిసద్వైభవా
న్నతి సైరింపఁగ నోపువారె పలుకుల్
సవ్యాప్యృతాసారముల్
మతి దీప్తాగ్నిఖుపో సగోత్రులకుఁ ద
న్మాహాత్మ్యము లెవ్వంతలే. 223

ఆ. ఇమ్మహాగ్రవిపిన మొల్లు పురంబుగాఁ
జేయువాఁడ ననుచుఁ జింతఁ గలఁగి
యంబుజాయతాక్షు నడిగిన నమ్మహా
పురుషుఁ డనియె ధర్మపుత్రుతోడ. 224

క. నను నెఱిఁగి పూజసల్పిన
యనఘులకున్ వాంఛితార్థకార్థము లబ్బున్
వినుము నను మించువాతని
బెనయఁగ నేఁడు గల్గువే విశ్వమునన్. 225

తే. అనఘ మధ్యాహ్నవేళ సమాగతుఁ డగు
నతిథి ననుఁ గా నెంచుచు నిల్పి పదనిఁ బూజ

సేయు ధర్మాత్ముఁ డుజ్జ్వలశ్రీసమృద్ధిఁ
బ్రబలు నతిథిని మించుపాత్రంబు గలదె. 226

తే. విభవముకొలంది నొసఁగక వితతలోభ
కలితుఁ డగు మానవుండు దుర్గతులఁ జెందు
మఱియు నాతండు నూఱుజన్మములదాఁక
నతిదరిద్రతచేఁ గుందు నవనినాథ. 227

తే. కొంచె మైనను ఘనమైనఁ గుటిలపడక
పాత్రభూతున కిచ్చుట పాడి మనుజుఁ
డన్న జలదానకుశలవాక్యములఁ జెల్చి
యాచకులయాస దీర్పంగ నగు నృపాల. 228

క. పాత్రప్రదానమహిమను
ధాత్రీశ్వర యల్పమైన దానధికంబౌఁ
బాత్రింబ సేని నన్ను న
కృత్రిమగతిఁ బూజసేయు మిచ్చెదఁ గోర్కుల్. 229

చ. అనవుడు వన్యమూలక ఫ
లాజ్యపయోదధిముఖ్యదివ్యవ
స్తునికర మిచ్చి ధర్మజుఁడం
తోయజనాభునిఁ బూజసేసె న
య్యనఘుఁడు ప్రీతుఁడై యపుడ
యామరవర్గముఁ జూచి పాండునం

దనుజులకు నొక్కపట్టణ మం
బారగతిఁ గల్పింపు మీ వనఁగ. 380

క. అపు డాతఁడు నింద్రప్ర
స్థపురము నిర్మించె శిల్పచాతురిచే నిం
ద్రపురవరలక్ష్మి మిగిలిన
యపరిమితశ్రీసమృద్ధి నలరారంగన్. 331

ఉ. హస్తిపురంబు దానిపది
యోజనవాలునఁ గోలకున్న ద
వ్యస్తుసమృద్ధిచే నిటయె
స్వర్గపురం బని సర్వభూభుజుల్
ప్రస్తుతిచేసి రన్నగరిఁ
బాండునృపాలక ! యంత ద్వారకా
వాస్తునియోనఁ గైకొని ధ
వత్సుతు లందు వసించి రొప్పుచున్. 282

ఆ. అట్టు లప్పురమున ననుపమైశ్వ
కలితు లగుచుఁ దనరి రలఘుమహిమ
ధరణినాథ నీదుతనయుల కిడగ
తరియి నసాధ్య మెద్ది తలఁచి చూడ. 283

వ. అని తెల్పిన నారదునకుఁ బాండవాగ్రజుం డిట్లనియె. 284

ఆ. కర్మదూరులకును ధర్మేతరులకు స్వ
ర్గంబు చేరఁగరాదు చిత్రమౌత్ర

గముగతి సలరుచు నయ్యా
గము సేయఁగఁ బూని మానిఁ గని యిట్లనియెన్. 238

ఆ. ఇతరుఁడు సేయుధర్మ మొనరంగ నన్యున
కెట్లు పొందు నన్నునింద్రిచంద్రి
తలఁప నితరునకును ఫలమిచ్చు నేనియుఁ
గర్త కెట్లు ధర్మగతిని వెలయు. 239

క. సర్వజ్ఞుండవు నీవుదక్కఁ దక్కినవా రోవ కీసంశయంబు
వాపవే యని యడిగిన నతనికి నారదుం డిట్లనియె. 240

తే. ధర్మసూక్ష్మంబుఁ జెప్పెద ధర్మరాజ
వినుము తథ్యంబు నీపల్కు వేఱ యొకఁడు
సేయుపుణ్యంబు లితరులఁ జెంద వైనఁ
దనయుఁ డొనరించు సుకృతంబు జనకుఁ జెందు. 241

చ. తనయుఁడు సల్పుసత్క్రియకుఁ
దండ్రియ కర్త యగుం జగంబునన్
మును పతి భార్యగర్భము న
మున్నతవైఖరిఁ జొచ్చి పుత్త్రుఁడై
జననము నొందుఁ దాన విల
సద్గతిఁ దండ్రియు నా కుమారుఁడై
ఘనుపగు వార లిద్దఱకు
భేదము లేదు తలంచి చూచినన్. 242

తే. గిపమునఁ బుట్టు వేఱొండుగిపమట్లు
జనకువలనఁ దనూజుండు సంభవించు
నట్లు గావున ధర్మాత్ముఁ డైనసుతుఁడు
తండ్రిఁ దరియింపఁగాఁ జేయు ధరణినాథ. 243

క. తనయుం డనఘస్మరణుఁడై
జనకునిదుర్గతులఁ జేర్చు జనములు సుతులన్
మును పెక్కండ్రం గోరుదు
రనఘా యం దొకఁడు సుకృతి యగునో యనుచున్. 244

క. పాపముసేయరు పాజ్ఞులు
పాప మిహాముత్ర వైరి పాపాత్మునితో
నేపొందఁ జెలిమిచేసిన
యాపురుషుఁడు తత్సమానుఁ డగు నిక్కముగన్. 245

సీ. అఘకర్ముఁ డగువాఁడు యమలోకమున కేఁగి
యందు నారకదుఃఖ మనుభవించి
వెండియు ధరఁ బ్రభవించి తద్వాసన
నసని కుందుచు నుండు నట్టు లనిన
నసిపత్త్రవనవాసి యగునట్టి మనుజుండు
వికలాంగుఁడై ప్రభవించుఁ జూవె
తప్తతైలకటాహనుప్తుఁ డామర్త్యుండు
రాజయక్ష్మఁ గృశించు రాజతిలక

మఱి నిరుచ్ఛ్వాసగతుఁడైన మూషవృందు
శ్వాసరోగార్తుఁ డగుచు నిట్లు జగతిఁ బుట్టి
భూరిపూర్వాఘసంస్కారకారణమున
బాప మొనరించుఁ గ్రమ్మఱఁ బంచజనుఁడు. 246

సీ. కావునఁ జిత్తవాక్కర్మకృతంబైన
పాపంబుఁ బాపంగఁ బ్రాదితంబు
గౌతమీపుష్కరగంగాదినదులలోఁ
జేయంగఁ దగు నట్లు చేసితేని
వేఁచినగింజల వెస నంకురంబులు
గలుగనిరీతిఁ బ్రాగ్జన్మకలుష
వాసన యణఁగు భూవల్లభ యట్లు ప్రా
యశ్చిత్తశుద్ధాత్ముఁ డగుచు నుండు
వెండి దురితంబు లొనరింప కుండవలయు
ధర నహంకారధనలోభదర్పతలనఁ
గలుష మొనరించి మరల దుర్గతి వసింపఁ
గలుషభోగవిరామంబు గలుగ దెప్పుడు. 247

తే. నీవు హరిభక్తుఁడవు ధర్మనిపుణమతివి
రాజసూయంబు సేయుము రాజవర్య
యజ్ఞకర్మంబు ధర్మంబునందుఁ బెద్ద
యఖిలలోకాదిపూజ్యుఁ డయ్యజ్ఞకర్త. 248

తోయజనాభునిం బిలువ
దూతజనంబులఁ బంచె నర్మిలిన్. 252

తే. ద్వారవతి కేఁగి వారలు వాసుదేవుఁ
గాంచి ధర్మజుఁ డనిపినకార్యము దెల్ప
నపుడు శిశుపాలుపైఁ దండయాత్ర సేయఁ
బయనమై యున్న పెద్దన్న బలునిఁ జూచి. 253

కం. ఆర్య సుహృత్కార్యము సుర
కార్యంబును నొక్కసారి గదిరెన్ ధీచా
తుర్యమునఁ దెల్పు మిం దే
కార్యము సేయంగ నగు జగద్ధిత మునివరా. 254

తే. అనిన విని యాప్రలంబదైత్యారి వల్కె
నిపుడు శిశుపాలుఁ డెగటార్చు టిదియ మేలు
ప్రబలతరుఁ డగునభియాతి పైని గలుగ
నిదురవచ్చునె కంటికి నీరజాక్ష. 255

కం. హాలహాలి నజాండభాండం
బులు చక్కడంచెద నరాతిఁ బొడుచుట యరుదే
నిలుపుము సేనలఁ జైద్యుం
బొలియించెద సేన యరిగి పురుషవరా. 256

వ. అని పలికిన. 257

కం. అద్ధీరవరుని నడిగిన
పద్ధతిఁ దను నడుగఁ గార్యభాగజ్ఞుండై

బుద్ధిం గీష్పతి కైన యగు
నుద్ధవుఁ డిట్లనియె నయ్యదూద్వహుతోడన్. 258

ఉ. ధర్మజుఁడు తేజముం జలధి
యంబులు గోరినమాడ్కి విశ్రుతో
దర్కమహోఘలజ్ఞుఁడవు
తామరసాయతనేత్ర నీవు మ
త్కార్కశభాషణాశ్రవణ
కాంక్ష యొనర్చితే నీదుసన్నిధిం
దర్కశలాపప్రియుండుఁ దగు
దైవతమంత్రియుఁ బల్కనేర్చునే. 259

ఉ. వినను నాథుఁ బోలినక్రి
య న్నివరింతు మఖంబు సేయఁగాఁ
బూనిరి పాండునందనులు
భూసుత వైఖరిఁ దత్క్రియాఘనం
ధాన మొనర్చు హే తొకఁడు
దక్షుఁడు గల్గునె నీవుదక్క నీ
మేనమఱందు లార్యజన
మిత్రులు వారలఁ బ్రోచు టొప్పగున్. 260

వ. కౌంతేయులు నీయధీనులు గావున నచ్చటికిం జని తదీయా
ధ్వరకార్యభారంబు వహింపందగు నదియునుం గాక. 261

ఉ. పంకజపత్త్రనేత్ర శిశు
పాలుఁడు సచ్చటి కేఁగుదెంచుఁ గూ
లంకషగర్వదుర్వహాబ
లంబున నిన్నుఁ దిరస్కరించి ని
శ్శంకఁ జెలంగు రాజపరి
షద్గతు నాఖలచిత్తు మత్తు నా
వంకను ద్రుంపరాదె సుర
వార ముదారబుద్ధిఁ జెలఁగన్. 262

క. కావున ధర్మజుపాలికిఁ
బోవుట నీతి యని తోఁచెఁ బొలుపొందఁగ నా
భావంబున నట మీఁదట
దేవరచిత్తంబు సర్వదేవప్రవరా. 263

వ. అని తెల్పిన. 264

క. ఉద్ధవుని మెచ్చి లోకశు
భోద్ధవసంధాతి పురుషోత్తముఁ డయ్యా
గోద్ధరణసిద్ధమతిచే
సద్ధర్మజుపాలి కరిగె సామాత్యుండై. 265

వ. అప్పుడు. 266

ఉత్సా. భ్రాతృసహితుఁ డగుచు ధర్మరాజు వాసుదేవు వి
ఖ్యాతభక్తిఁ బూజసల్పి యాగకరణవాంఛ నా

కీర్తిం జనించెఁ దన్మహీయధర్మ మీవు సం
ప్రీతి నిర్వహింపు మనుచుఁ బేర్మి నేఁడు నాయనన్. 267

వ. కృష్ణదేవుండును విశ్వంభరాభారహరణంబునకు నిదియె
బీజం బని విచారించి యిట్లనియె. 268

ఆ. అనఘ రాజసూయయాగంబు సేయంగఁ
దలఁచితేని విశ్వధాత్రిఁ గలుగు
నవనిపతుల గెల్చి యాగిగొనవలయు ని
య్యదియె ధర్మమునకుఁ గుదురు తలఁప. 269

క. మున్ను జరాసంధనృపున్
మన్నిగొనఁగవలయు వాఁడు నడఁచుట నృప నీ
జన్నమున హవిర్భాగము
లన్నిర్జరు లంద రతిభయాన్వితు లగుదుర్. 270

క. అని పల్కి ధర్మనందను
ననుమతిఁ గొని పవనసందనార్జునయుతుఁడై
చనియెన్ భూసురవేషం
బున హరి మగధాధినాథుపొంక మడంపన్. 271

క. ఆద్వారంబున నరిగి గృ
హద్వారముఁ జేరి యమ్మహాత్ములు మువురున్
విద్వన్మూర్తు న్నిలిచిన
సద్వారస్థితుఁడు చెప్పె ధరణీపుతోడన్. 272

సీ. ఆజరాసంధుఁడు ననిశంబు భూసుర
వరులఁ బూజ యొనర్చువాఁడు గాన
నలరి చిత్తంబునఁ దలఁచె నిట్లని వీరి
వాంఛితార్థము లియ్యవలయు నిష్ఠ
వైశ్వదేవక్రియావసరసమాగతా
తిథివర్గములయాశ దీర్పఁ బాడి
సముదుసంప్రాప్తుల విముఖులఁ గావించు
జీవనంబునకంటెఁ జావు మేలు
లలితమాధుర్యధుర్యఫలంబు లొసఁగి
తరువు లైనను బ్రాణులఁ దనుపుచుండు
నది తదీయస్వభావంబ యాగుణంబు
మాదృశుల కెల్ల బోధింప మతము గాదె. 273

వ. అని తలపోయుచుండె ననిన విని శౌనకుండు సూతున
కిట్లనియె. 274

ఆ. అఖిలధర్మవితతి నవనిపై నిలుపంగ
నవతరించినట్టి యంబుజాక్షుఁ
డతిథిపూజ సల్పు నతిధర్మయుతుఁడు మఱి
క్షోణి నేల దునుమ నిచ్ఛయించె. 275

వ. అని యడిగిన సూతుం డిట్లనియె. 276

సీ. పరదారహరణంబు పరవంచనంబును
నిజకులోచితకర్మనిరసనంబు

సాగ్నికసద్విప్రవృందసంపరిత్యాగంబు
సంతతదుర్జనసంగ్రహంబు
సకలజగజ్జాలసంక్షోభకరణంబు
భూరినిజోదరపూరణంబు
సనిమిత్తహాసనపాపానుచింతనములు
నిర్దయత్వము వృద్ధనిందనంబు
నెవ్వనికి నైజగుణము లాహీనమనుజుఁ
డెట్టిసుకృతంబు సల్పిన నేపడంగు
భస్మవిన్యస్తహవ్యంబుభంగి యగుచుఁ
గరటిభుక్తకపిత్థంబుకరణి యగుచు. 277

వ. జరాసంధుండు జగత్సంతాపకరుండై దుర్వృత్తిం బ్రవ
ర్తించుఁ గావున నద్దేవుని కారుణ్యంబునకుఁ బాత్రుండు
గాఁ డన్యో సది యట్లుండె నట్లుతం డప్పురుషప్రకాండుల
డగ్గఱం జని ప్రాంజలి యై యాతిథేయం బైన యిష్టా
ర్థం బొసంగి సంతుష్టులం గావించెదం గొనుం డని
ప్రార్థించిన వానికిఁ గృష్ణుం డిట్లనియె. 278

మ. సురవిద్వేషివి సర్వభూభుజుల నం
క్షోభింపఁగాఁ జేయు చి
ద్ధరకున్ దుర్భరభారభూతుఁడవు మి
థ్యాదృష్టి వీక్షావశా

త్కారముల్ సమ్మఁగ రాదు మాకుఁ గదు నిం
ద్యం బైన నీయన్న చే
కరణిఁ గ్రాహ్యము నీమనం బిరవు ని
ష్కారుణ్యసంపత్తికిన్. 279

తే. సత్కులీనతయును ముదుసలితనంబు
సిరియుఁ గలిగిన దుష్టుండు శిష్టుఁ డగును
సాధుసజ్జనమానసశల్యతుల్యుఁ
డైనమనుజుండు సాధు వెట్లనఁగఁ బరగు. 280

వ. అనిన విని యాతం డిది దానసమయంబు మీకెద్ది గావ
లసిన నిచ్చెద నడుగుం డనినఁ గృష్ణుండు శక్తి గలదేని
మాతోఁ గయ్యం బొసరింపు మని పలికిన నగి వాఁ
డిట్లనియె. 281

శా. మీర ల్విప్రులు శక్తిహీను లధము
ల్మృష్టాన్నసూపాజ్యముల్
గోరంగాఁ దగుఁ గాక మాదృశులతో
ఘోరాజి చేయ న్మదిం
గోరం జన్నె వసుంధరాధిపులతో
క్షోణీసురు ల్వీరులై
పోరం జేయుదురే మనం దలఁచినం
బొండింక మీయిండ్లకున్. 282

క. సమరముసేయుఁగ నాతో
సము లెందును లేరు మీ రశక్తులు రణరం
గమున న్నిలువ సమర్థులె
యమితబలోదగ్రు నన్ను నాఁగంగలరే. 283

తే. కలహ మొనరించుకోరిక గలిగెనేని
యట్ల కావింతు విప్రవేషాఢ్యు లగుచు
నేఁగుదెంచితి రిందు మీ రెవ్వ రేమి
పనికి నింతయుఁ దెలియంగఁ బలుకవలయు. 284

వ. అనిన వానికిఁ గృష్ణుం డిట్లనియె. 285

ఉ. భీముఁ డితం డితం డహిత
భీముఁడు ఫల్గునుఁ డేను కృష్ణుఁడన్
శ్రీమను రాజసూయ మొన
రింపఁగ దీక్ష వహించె ధర్మజుం
డేము దదాజ్ఞ ని న్గెలువ
నిచ్చటికిం జనుదెంచినార మి
ట్లామఘులీల కెన్నఁ బ్రథ
మాంగము దుర్జనశిక్ష గావునన్. 286

వ. అనిన విని యతండు దండతాడిత భుజంగంబుభంగిఁ
బొంగి యప్పింగళచేలునిం గనుంగొని. 287

సీ. ఓహో సుయోధనుం డొకయూ రొసంగిన
బ్రతుకుధర్మాత్మజుపనుపుచేతఁ

జనుఁడెంచితే నీవు సత్యంబు పలికితి
　　చనుఁ జను నీకు సజ్జనపటిమ
శమనాత్మజుఁడవు నీవు సమరపరాఙ్ముఖు
　　లెంతయు దుర్బలు లేమి చెప్ప
యుద్ధరంగమున మున్నోడి పెండియుఁ బాండ
　　వులఁగూడి నను గెల్వఁ దలఁచితో కో

యహహా నీసత్త్వ మెఱిఁగినయదియె తలఁప
బాలుఁ డబలుండు నరుఁడు గోపాల వీఁడు
కలను గావింపఁ జాలఁ డిక్కడిఁ దిబలుఁడు
భీముఁ డొకరుండె నాతోడఁ బెనఁగ వలఁతి. 288

క. అని పలికి మగధనాథుం
డనికిఁ బిలువఁ బవనతనయుఁ డాయితమై గ్ర
క్కున నెదిరి పోరెఁ గ్రీడియు
వనజదళాక్షుఁడును పార్శ్వవననిధిఁ జేలన్. 289

తే. సమర మొనరించి రప్పు డయ్యమితబలులు
సమబలంబున భీమవిక్రమునిరూఢి
సమరగణములు వ్యోమయానముల నిల్చి
సమవధానత వీక్షించి సంభ్రమింప. 290

ఉ. ఒండొరుఁ గిట్టి పట్టుచును
　　నొండొరుఁ బాయుచు డాయుచున్ మహో

ద్దండతలప్రహారహతిఁ
దద్దయు దద్దరిలంగఁ జేసి దో
శ్చండిమఁ జూపుచుఁ గడు మదగ
జమ్ములచందమునం జెలంగి యా
దండిమగల్ పెనంగిరి ము
ష్టిపదతాడనపీడనోద్ధతిన్. 291

వ. ఇట్లు ఘోరయుద్ధంబు సేయునెడ. 292

ఉ. గంధవహాత్మజుం డపు డ
ఖండితసత్త్వసమగ్రతన్ జరా
సంధు మహోగ్రకాయము వి
సం బెనువ్రక్కలు చేసి వైచి త
ద్బంధుల కెల్ల సాధ్వసము
దార్కొన బిట్టుగ నార్చె సర్వది
క్సింధురకర్ణము ల్వగులఁ
గృష్ణుఁడు జిష్ణుఁడు సంతసిల్లఁగన్. 293

వ. ఇట్లు భీమసేనుండు జరాసంధుమేను రెండువ్రయ్యలుగాఁ జీరివైచి ననంతరంబ వాఁడును జర యనురక్కసిచేత సంధింపఁబడి లేచివచ్చె. 294

తే. బవర మొనరింపఁ గరువలిపట్టి వాని
నట్ల చీరిన రెండియు నతుకుకొనియెఁ

తెలిసి పలుమాఱు గాఁగఁ జేరి తనవ
నడచుకొని వాఁడు గ్రమ్మఱ వని రయున్. 295

వ. అంతఁ బయునొక్కండవయుద్ధంబునందు. 296

తే. పవనజుఁడు చూడఁ దృణము చేఁబట్టి చీరి
యవల నీవలఁ బడ వైచె నచ్యుతుండు
తత్ప్రకారంబు గని వానితనువుఁ జీరి
వైచె నత్తున్కలీవ లావలగ నతఁడు. 297

వ. అప్పుడు సురలు పరమహర్షంబునఁ గుసుమవర్షంబులు గురియించుచు నిర్భయంబున వర్తిల్లి రిట్లు విజయుంబు గైకొని విజయాగ్రజుండు తమ్ముకొలంకునం గ్రీడించు మత్తకరిం బురుడించె నంత. 298

చ. అనిలజుచేత నిట్లు మగ
ధావనిపుం దునిమించి తద్గృహం
బునఁ జెఱ నున్న భూపతులఁ
బొల్పమరన్ విడిపించి వాని నం
దను సహదేవుఁ దత్పదము
నం దగ నిల్పి తిరీయసూత్నర
త్ననికరముఖ్యవస్తువు ము
దంబునఁ గైకొని శౌరి గ్రక్కునన్. 299

తే. అనిలజార్జునసహితుఁడై యరుగుదెంచి
యమ్మతనూజునిఁ గని మగధాధినాథుఁ

దనుమున్వృత్తాంత మాద్యంతమును వచింప
హర్షవారిధి నోలాడి యతఁడు పల్కె. 300

సీ. జగదీశ నీకు నసాధ్యంబు గలదె నీ
నిశ్వసితంబులు నిగమవితతి
కర్తవు భోక్తవు గారయితవు నీవ
ఫలదాయకుఁడ వగు ప్రభుఁడ వీవ
నీయనుగ్రహమున నిఖిలాపదలు మున్ను
గడచితిఁ బ్రఖ్యాతిఁ గాంచఁగంటి
రాజసూయమహాధ్వరంబు సేయించి మ
జ్జనకు వాంఛాపూర్తి సలుపు మింక
శంఖచక్రగదాహస్త జలజనేత్ర
భూతభావన భూతేశ పీతవసన
ద్వారకావాస కేశవ వాసుదేవ
నన్ను రక్షింపు మిదె నీకు నతి యొనర్తు. 301

వ. అనిన భగవంతుం డిట్లనియె. 302

ఆ. దుష్టనృపుల నెల్లఁ దునుమక రాజసూ
యాధ్వరంబు సాగ దవనిపాల
యపరిమేయసత్త్వు లవనిపుల్ రావణ
సములు పెక్కు గలరు జగతిలోన. 303

క. ఆరావణుఁ దునుముటకై
శ్రీరాముఁడు రవితనూజుఁ జేపట్టి సునా

సీతసుతుఁ బాలిం గపి
వీరున్ సమయించె నొక్కవిశిఖముచేతన్. 304

వ. రాఘవుం డవ్వాలిం ద్రుంచె త్రిలోకవిజయుం డగురావ
ణుండు సమరమునవాఁడెకా నూఁటిమిల్లి నవ్వాలివరాక్ర
మాతిశయం బాకర్ణింపుడు. 305

చ. వననిధిఁ గ్రుంకి యూర్ధ్వగ
వల్లభుఁ డొక్కట సంధ్యవార్చుచుం
డనవయుఁ డాడిపెట్టు బల
దర్పితుఁ రావణుఁ బంకఁబట్టి చ
య్యన నిజవాలరోమమున
నంటఁగఁగట్టి రయంబునం జతు
ర్వనధుల ముంచెఁ దత్సుభట
వర్గము దోమలలీలఁ దూలఁగన్. 306

వ. అంతఁ బులస్త్యప్రార్థితుండై యంభోజసంభవుం డారా
వణు విడువు మని వాలిపాలికి నొక్కదూతం బంపిన.

ఆ. భాతమింటఁ జలిగి తల్లోక మంబుధి
గలువువాఁడ ననుచుఁ గపివరుండు
లోకఁ బట్టఁబెట్టి ద్రిమ్మరించు ఖిల్లి
యురుగుదెంచెఁ దాన యాతవికదము. 307

శా. ఆకంజోద్భవుప్రార్థనంబునఁ బ్లవం
గాధీశ్వరుం డంతఁ ద

శ్లో॥ స్థూలనవాంధ మాని యట మర్త్యా
లోకముఁ బత్తుఁ సురా
నీకారిఁ దశకంధరుఁ డిడెఁ దాఁ
నే విశ్రవఃప్రశ్రయుం
దా కారిప్రముఖామరౌఘములు దగ
బల్కాలు గీర్తింపఁగన్. 309

ఆ. పృథులలోకకంటకుఁడై చెలఁగి
కంగుఁ దగుచుఁ బోయి యనురథర్త
జెండి సర్వలోకవిరతి బాధించె దు
ర్జనుఁడు శిక్షఁ జెంది సాధుఁ డగును. 310

ఆ. పరవిహింసనంబుఁ బాపవర్తనమును
జగతి ఖలుల కెన్న సహజగుణము
లట పునర్భవంబు నందియుఁ బరిహింప
మానలేరు వారు మనుజనాథ. 311

వ. పతివ్రతయైన యంతివ పురుషు ననువర్తించునట్లు సాధు
త్వంబును ఖలత్వంబును జన్మజన్మాంతరంబులం బాయక
ప్రాపించు ఖలులకు నిహపరసుఖంబులు దూరంబు లగు. 312

క. ఆరావణుండు రాముని
చే రణమున నిహతుఁ డగుచు శిశుపాలుండై
ధారుణి జన్మించె దురా
చారుండును భూరిసత్త్వసంపన్నుఁ డై. 313

వ. జరాసంధుండు హతుం డయ్యె శిశుపాలుండు మడిసెన్ వాఁడుగాఁ దలంపు మింక దుర్యోధనదుశ్శాసనకర్ణ శకునిశల్యప్రభృతి నరపతుల్ లోకకంటకాకారంబున హతు లయ్యెద రనిన విని ధర్మరా జిట్లనియె. 814

ఆ. అజరాసుతుండు హతుఁ డైనఁ బాద్యశ
క్తిరధరణిపతులు కోటి గలరు
వారి నెల్ల గెలువవచ్చు నాయనుజు ల
వ్వనికిఁ బూనఁగలరె పద్మనాభ. 815

వ. అనినం గృష్ణుం డిట్లనియె. 816

శా. రాజవ్యాజమునం జనించు దనుజ
వ్రాతంబులం ద్రుంప నం
భోజప్రిద్భవుచేతఁ బ్రార్థితుఁడనై
పాల్పొంది కృష్ణాఖ్యచే
నే జన్మించితి యాదవాన్వయమునన్
స్వాశ్వోశ్వరుం డైన యం
భోజాక్షుండఁ జుమీ యెఱుంగు మిది నా
భూపాలచూడామణీ. 817

తే. అజుఁడు సృజియింపఁ బాలనం బాచరింతు
నేను; హరియించు శంభుఁడు నృపవరేణ్య
హరుఁడు నాశక్తిఁ గాని ప్రోచు నరసి జగము
లేను హరుశక్తిచే హరియింతుఁ జూవె. 818

ఉ. అక్షయదివ్యవిగ్రహుల
  నైన హరుండును నేను నవ్యయా
శిక్షణరక్షణక్రియలు
  సేయుదు మెందును సర్వభంగి నీ
రాక్షసరాజరాజి సమ
  రంబునఁ గీటకకోటిఁ బోల నే
శిక్షణ మాచరింతు నృప
  శేఖర చింతలఁ గలంగ నేటికిన్. 819

తే. శివునిఁ బూజించి నను వెలిసేయునతఁడు
శివుని దూషించి నన్నుఁ బూజించునతఁడు
తామసులు వార లిరువురు ధరణిలోన
లేదు హరునకు నాకును భేద మధిప. 820

క. కాంచీశ్రీశ కాశికాది
క్షేత్రంబుల నిరువురము వసింపుదు మెల్లయెన్
సత్త్రీశనులం బ్రోచి జ
గత్త్రయిఁ గల దుష్టమతుల ఖండింతు మొగిన్. 821

క. శివుఁ డర్జునుండు ధరణీ
ధవ నే నారాయణుండ దైత్యవధార్థం
బవని నుదయించితిమి యి
ట్లనినాభావంబు మాకు నను వారు నెపుడున్. 822

క్రిందవననందనుం డొకరి
కయ్యమునర్చిరి తత్పరాక్రమం
బెందును మున్నెఱుంగమి మ
దేభశతాంగతురంగపంక్తితో
నందఱు నైకమత్యమున
నాహవదోహలతన్ రయంబునన్. 328

ఉ. అర్జునకీర్తిశాలియు న
యానయశౌర్యవిదుండు నైన య
య్యర్జునుఁ డాన్నృపాలకుల
నందఱ ఘోరరణంబులోన వి
స్ఫూర్జితలీలచే గెలిచి
పుష్కలనిష్కమణిప్రతాన ము
త్పూర్జితవృత్తి వారిదెస
నొప్పుగఁ గైకొని యేఁగె గ్రక్కునన్. 329

వ. ఇత్తెఱంగున నుత్తరీయు లగు ననేకదేశాధిపతుల నోడించి యనంతకాంచనమణిగణరాసు లప్పనంబు గొని హిమాచలంబును మానససరోవరంబును నతిక్రమించి యక్షకిన్నరగంధర్వనివాసదేశంబుల కరిగినం దత్రత్యు లగు ద్వారపాలకు లర్జునున కిట్లనిరి. 330

క. మనుజులకుఁ జొర నశక్యం
బనఘా యుద్దేశ మింక నవలఁ జనకు మే

పని కిచటి కరుగుదెంచితి
వినుపింపుము నీదు తెఱఁగు విస్పష్టముగన్. 331

ఆ. అనుడు ధర్మరాజయాగార్థమై దిగ్జ
యంబుసేయ నిటకు నరుగుదెంచి
నాఁడ నర్జునుఁడ ధనంబు దత్ప్రీతిగా
నొసఁగి తద్వశగతి నుండుఁ డీరు. 332

వ. అనిన. 333

ఆ. వారు నుల్లసిల్లి ఖానవి కమితహి
రణ్యరత్నరజతరాసు లొసఁగి
రట్లు గెలిచి ధనముపార్జించి యతఁడు ధ
నంజయాఖ్యఁ దనరె నాఁటఁగోలె. 334

వ. ఇత్తెఱంగున నుత్తరదిక్కునరేంద్రుల గెల్చి నరుం డనేకనర
ఖరోష్ట్ర కరిహరిశతవాహ్యం బైన ధనంబు దెచ్చినం
జూచి ధర్మజుండు. 335

క. నిజభుజబలమున ధరణీ
భుజులం దుర్జయుల గెలిచి భూనుతగతిచే
విజయమ్ము నొందితి గావున
విజయాఖ్యవహింపు మీవు విశ్వములోనన్. 336

వ. అని యతని మన్నించెఁ దదనంతరంబ. 337

ఉ. ధీచరితుం డదభ్రరవి
తేజుఁడు వాయుసుతుండు ధీరతఁ

ప్రాచికి నేఁగి యందు శిశు
పాలముఖావనిపాలురం ద్రియా
మాచరులన్ జయించి గరి
మన్ మణిహాటకముఖ్యవస్తు లు
గ్వ్రచర *ఖేచరప్రతతి
విస్మయ మందఁగఁ దెచ్చె గ్రక్కునన్.

ఉ. దక్షిణదిగ్జయార్థము ము
దం బడరన్ సహదేవుఁ డేఁగి వి
శ్వక్షితినాథులం దొడరి
వశ్యులఁగా నొనరించి వారిచే
సకలయహేమరత్ననిచ
యంబులు గైకొని నీలుఁ డన్ ధరా
ధ్యక్షునిమీఁదఁ బోయిన న
తండును బోరె సభార్యసౌఖ్యుఁడై. 339

వ. ఇట్లు మాహిష్మతీపురపతి యగునీలుంతో మహాయు
ద్ధంబు సేయునెడ. 340

ఆ. అతని యల్లుఁడైన యగ్నిదేవుఁ డపుడు సహ
దేవుసైన్యసమితిఁ దీవ్రశిఖల
నేర్పఁబొచ్చె దాని నెఱిఁగి యుధిష్ఠిరుండు
ప్రస్తుతింపఁ దొణఁగెఁ బవనసఖుని. 341

---

* వీరవిప్రతతి—పాఠాం.

ఉ. హవ్యము మోచి తెచ్చి యజ
రాళికి హాళి సెలంగ నిచ్చుటన్
హవ్యవహాఖ్యచే వెలసి
తాగమసంతతి సంతతంబు నీ
దివ్యమహాత్మ్యలీల గను
తింపఁగ నాహవనీయగార్హప
త్యాన్వయదక్షిణానలస
మాఖ్యఁ జెలంగుదు వాశుశుక్షణీ. 842

క. మారుతసఖ నీకు నమ
స్కారము ధర్మజుఁడు సేయు క్రతుకర్మం బిం
పారఁగ భవదర్థమె కా
యారయఁ దద్విఘ్నకరణ మది యుచితంబే. 843

చ. అని వినుతింప హవ్యవహుఁ
డప్పుడ మామకుఁ దెల్పి పాండునం
దనునకు రత్నకాంచనవి
తానము లెంతయుఁ బ్రీతి నిచ్చినం
గొని విజయాధ్యుఁడై యతఁ డ
కుంఠితవైభవ మొప్ప లంకకుం
జనిచె దశాననానుజుని
పాల్కి వాప్తుల శౌర్యదీప్తులన్. 844

క. ప్రణిధిముఖంబున నానృప
మణి వచ్చుట దెలిసి యమరమాన్యుండు విభీ
షణుఁడు తన*పాలఁ గల ధన
మణినికరము కర మొసఁగె సమందవిభూతిన్. 345

వ. ఇవ్విధంబున నపాచీదిగ్విజయం బొనరించి సహదేవుం
డును నిజపురంబున కేతెంచె నిట్లనుజానీతదిగ్జయోపార్జి
తానంతకనకమణిరాసులఁ గాంచి యుధిష్ఠిరుం డత్యంత
హర్షితస్వాంతుం డయ్యె నంత. 346

తే. హరియును ననేకధన ముపాయన మొసంగె
నిట్లు సంపన్నుఁడై యాతఁ డీధనంబు
సద్ద్విజాధీన మొనరించి జలజనాభ
యాక్రతుక్రియ తగ నిర్వహింపు మనిన. 347

వ. కృష్ణుం డతనిం జూచి. 348

క. చేయుము క్రతూత్సవం బెడ
చేయక భద్రంబు లెల్లఁ జేకుఱు నీకున్
నీయనుజన్ములు నేనును
ధీయుత ప్రత్యూహసమితి ధృతిఁ దోలంగన్. 349

తే. అనిన ధర్మజుఁ డానందవనధిఁ దేలి
దేవకీనందనునిఁ బ్రస్తుతించి యమ్మ

* పాలఁగలిగిన — పా. భా.

హాపురుషునాజ్ఞ సద్వరాయతనముఁ బ్రి
వేశ మొనరించె సమధికవిభవ మొనఁగ. 850

ఉ. ఆతఱి హృద్యవాద్యనిచ
యంబులు మ్రోయ నమేయధీయుతుల్
గాలవనారదాత్రిభృగు
కశ్యపకౌశికధౌమ్యముఖ్యవి
ఖ్యాతమహామునీంద్రు లఖి
లాగమశాస్త్రపురాణపారగుల్
ధాతృసమాను లాన్నృపవ
తంసుని దీక్షితుఁ జేసి రిమ్ముగన్. 851

తే. పైలధౌమ్యులు హోతలై పరఁగి రంత
జల్పె బ్రహ్మత్వ మప్పరాశరసుతుండు
యాజ్ఞవల్క్యవసిష్ఠాదు లైనమౌని
వర్యు లధ్వర్యు లైరి భావంబు లలర. 852

వ. మఱియు వీరలపుత్త్రపౌత్త్రులును గన్యవర్గంబులును దత్త
త్కర్మకరణతకుం బొలుపడి రట్లందఱుఁ బుణ్యాహంబు
సేయించి యుచితవిధులం బ్రవర్తిల్లుచుండి రంత. 853

మ. అహితాహంకృతిభంజనప్రథితబా
హాస్థేమసంపన్నుఁ డా
సహదేవుం డపు డద్ధరాధిపతియా
జ్ఞం దమాతలం బంచి యు

క్షితిపై నాల్గుచెఱంగులం గల జగ
న్నాథన్యావసీదేవులా
మహిభృద్వర్యుల వైశ్యశూద్రుల నికా
మప్రేమ రావించినన్. 354

వ. ఇట్లు వచ్చిన నానాదేశాగతజననికరంబులు ధర్మరాజు
చేత నుచితసత్కారంబులఁ గాంచి రంత. 355

తే. అపుడు ధర్మజునానతి హాస్తిపురికి
నరిగి నకులుండు ద్రోణకృపాదిగురుల
నాపగేయాంబికేయాదు లైన సర్వ
కురుకదంబంబు నెల్లఁ దోడ్కొనుచు వచ్చె. 356

చ. బహుమణిభూషణంబులు న
పారధనంబులుఁ దెచ్చి యుష్ఠితా
మహధృతరాష్ట్రసూతసుత
మద్రమహీశసుయోధనాదు ల
మ్మహిపతి కిచ్చి యందు గరి
మ వసియింపఁగఁ జూచి యక్కురూ
ద్వహుఁడు సపర్యలం దనిపె
వారల నెల్ల బహూకరించుచున్. 357

వ. మఱియు ద్రుపదజయద్రథభగదత్తశిశుపాలాదిమహీపాల
కులును బలభద్రానిరుద్ధబభ్రుసారణసాంబగదసాత్యకి

వ్రద్యుమ్న చారుదేష్ణాదు లైన యదువృష్ణివీరులును
జతురంగబలసంపన్నులై యేతెంచి రనంతరంబ. 358

ఆ. నర్తకీజనములు నటులును వేనవే
లరుగుదెంచి రమ్మహాధ్వరమున
కంత వారి కెల్ల నభివాంఛితద్రవ్య
సమితి యొసఁగఁ బనిచె శమనసుతుఁడు. 359

సీ. అతులితభక్ష్యభోజ్యాధికారంబున
వడి దుస్ససేనుఁ గట్టడ యొనర్చి
యుర్వీసురావళి నుచితార్హణక్రియఁ
దేలింప గురుపుత్త్రుఁ బాలుపెట్టి
యఖిలరాజన్యుల నరసి పూజింపంగఁ
బటుమతి సంజయుఁ బాముకొల్పి
వివిధకృతాకృతవిజ్ఞానకలనకు
ద్రోణగాంగేయుల దొరలఁ జేసి
రాజు లిడు కానుకలు గొన రాజరాజు
నర్థనియతి నియోగించి యవనిసురుల
కపరిమితదక్షిణ లొసంగఁ గృపునిఁ బనిచె
నఖిలధర్మవిదుండు ధర్మాత్మజుండు. 360

వ. మఱియు విదురాదిసుహృజ్జనంబులం దగువారల నర్థ్యో
పనుల నిలువ నియమించి భూసురుల కనేకశతసహస్రా
యుతధేనుమణికనకాన్నదానంబు లొసంగుచు యథోక్త

విధి రాజసూయముం బాచరించె నిట్లు దినపంచకంబును
గడచినయనంతరంబ యాఱవదినంబునందు. 361

తే. అఖిలమానివరేణ్యులు నవనిపతులు
సర్వభంగి సమాసీను లైనఁ జూచి
యగ్రపూజ యిం దెవ్వరి కాచరింపఁ
బోనగు నని శాంతనవు ధర్మపుత్త్రుఁ డడుగ. 362

వ. అద్దేవవ్రతుం డిట్లనియె. 363

తే. సర్వయజ్ఞమయుండును సర్వగతుఁడు
మానిహృత్పద్మసద్మ్యుండు దానవారి
పద్మనాభుండు దేవకీపట్టి దక్క
వేఱొకఁడు పూజనీయుఁడే ధారుణీశ. 364

వ. కావున సర్వలోకనమస్కృతుండును నిగ్రహానుగ్రహ
దక్షుండును నగు కృష్ణదేవుఁ బూజింపు మనవుడు నట్ల
యద్దేవుం బూజించిన. 365

తే. యమతనయుచేతఁ బూజితుఁ డై విహాయ
సమున గ్రహజాలమధ్యభాస్కరునికరణి
ననుపమాచ్ఛచ్ఛవిస్ఫూర్తి నతిశయిల్లె
నంబుజాక్షుండు రాజసభాంతరమున. 366

సీ. అప్పుడు శిశుపాలుఁ డత్యంతకుపితుఁ డై
యాపగేయునిమీఁద నాగ్రహించి

వీఁడు వృద్ధుఁడు శాస్త్రవిదుఁడు గాఁ డవనీశ
ధర్మంబెఱుంగఁడు ధర్మజుండు
దలఁకె యాదవపురుషుఁ డద్భోధితుం డయి
సహదేవుఁడును బూజ సంఘటించె
సత్యప్రతిజ్ఞులు శాస్త్రజ్ఞులును నగు
రాజుల నెల్లఁ దిరస్కరింతు
రెట యపూజ్యులు పూజ్యులు నగుదు రెచటఁ
బూజ్యు లవమానసాప్తిచేఁ బొలుతు రెపుడు
నచట దుర్భిక్షభయమరణాదికములు
సంభవిలు నిక్కమం బిది శాస్త్రసరణి. 867

తే. పెద్ద లుండంగ నీచులఁ బిలిచి తెచ్చి
పూజసేయు టనర్థంబు బుధజనంబు
లందు సర్వవినాశంబు నపయశంబు
శ్రమము నరకంబుఁ గర్తకు సంభవించు. 868

వ. అని పల్కి శిశుపాలుండు. 869

క. తనవాసి యెఱుఁగ నేరని
జనములయిండ్లకును బోవఁ జనఁగా దని ది
గ్గన లేచిపోవ నపు డా
తని మరలఁగఁ దెచ్చె ధర్మతనయుఁడు నెమ్మిన్. 870

వ. అప్పుడు భీష్ముండు శిశుపాలు నుద్దేశించి ధర్మపుత్త్రు

నీతో నీసారమేయంబు వో యిన సేమి యగు నేల
యూరార్చి తెచ్చి తనిన వాఁ డిట్లనియె. 371

మ. తిల ముల్లం గడుఁ దెల్లఁగా నరసినం
తం బెద్దవే నీవు నీ
బలముం దృష్టియుఁ బుష్టియుం బొలిసె ని
ర్భాగ్యుండవై పుత్రదా
రలఁ బోషింపఁగ నోప కీగతి నిర
ర్థబ్రహ్మచర్యవ్రతం
బిలపైఁ దాల్చితి రాజ్యభారకథ నీ
కేండ్రైన సిద్ధించునే. 372

క. ఇల నృపుల గెలువ నేరుపు
గల దింతియకాని నీకుఁ గార్యాకార్యం
బుల నెఱుఁగఁ బోలునే రా
జులసభ నార్యుగతిఁ బలుకఁ జొప్పడియున్నే. 373

వ. నీ వుపదేశించు ధర్మంబు ధర్మరాజునకు నీకునుం గాని
రాజవర్యులకు సమ్మతంబు గాదు కులాచారపరిభ్రష్టు
లును రసవిక్రయోపజీవులు నైన యాదవుల నధికులంగా
నెన్నందగునే యనినం గోపించి సహదేవుం డిట్లనియె. 374

ఉ. యాగఫలప్రదుం డగు జ
నార్దనుఁ బూజ్యునిఁగాఁగఁ జెప్పె వి

శ్వాగమపారగుండు సరి
దాత్మజుఁ దప్పలుకు లసహింపరే
కీగతి దుష్టభాషణము
లెవ్వఁడు పల్కిన వానిమౌళిపై
వేగమె వామపాద మతి
విశ్రుతలీల ఘటింతు నీసభన్. 875

క. ఎఱిఁగించువాఁడు భీష్ముఁడు
మఱి శ్రీహరి పూజ్యుఁ డాశమననందనుఁ డి
త్తఱిఁ బూజకుఁ డిప్పనికిం
గొఱంత గలదె శ్రుతిహితం బగు న్విక్రమునన్. 876

వ. అనియె నంత నాశిశుపాలుం జూచి శాంతనవుం డోరీ మాతృసంబంధదోషంబున దయాపరుండైన ధర్మరాజు భోజనార్థంబు పిలిచిన వచ్చితివి యథేష్టంబుగా భుజియించిపోవుట గాక యులర్కంబు పురోడాశం బపేక్షించునట్లుగ శ్రీపూజంగోరందగునే వృథార్హానర్హ గర్హణంబు రాక్షసులకు సహజగుణంబు జన్మగుణచేష్టాదులవలన నీవు రాక్షసుండ వనిన వాఁ డజాతశత్రునిన కిట్లనియె. 877

చ. కులబలశాలు లైన నృప
కుంజరులన్ వెలిచేసి దుర్మతిన్
మలసితి ధర్మరా జనున
మాఖ్య నిరర్థక మయ్యె నీకు నీ

రలఁ బిలువంగఁ బంచుట తి
రస్కరణం బొనరింపనొక్కొ యీ
యలఘుబలాఢ్యులైన నృపు
లల్పులె నీమదిలోన నెంచుమా. 378

ఆ. కుమతి వగుచు గోపకునిఁ బూజసల్పితి
బ్రహ్మచారిమాట పాటిచేసి
యేమి గల్గె దీన నీరాజవర్యుల
క్రతువు కనుచుఁ బిలిచి గర్వ మణఁప. 379

వ. ఈగోపాలబ్రహ్మచారులకును నీయనుజు లగు భీమవిజ
యులకును వెలచువారిం దెవ్వరు లేరు జరాతనయుఁ
గపటవేషంబున జయించుట యాదిగాఁ దత్పరాక్రమం
బందఱకుఁ దెల్లం బయ్యె నని పల్కిన. 380

ఉ. అప్పుడు భీమసేనుఁడు ల
యాంతకుఁడై వడిఁ గ్రోధమత్తులం
జిప్పిల నిల్చి లేచి గద
చే నమరించినఁ దత్సభాసదుల్
దప్పక చూచి చైద్యుఁడు వృ
థా కలహించె మరుత్తనూభవుం
డిప్పుడు రాజబృందముల
నిందఱఁ ద్రుంచఁగ నున్నవాఁ డొగిన్.

క. మనము మన దేశమునకుం
జను టుచితం బార్యనింద సల్పెదు నీదు
ర్జనుపల్కులు వినఁగూడు నె
వినినం బుణ్యములు దొలఁగు వేయును నేలా. 382

చ. చెలఁగి మహాన్నిగర్హణము
సేయుదురాత్మకుఁ బట్టి యాసభన్
వెలువడఁజేయఁగాఁ దగు వి
వేకసమన్వితు లట్లు సేయఁగా
నలవడదేని కర్ణయుగ
మప్పుడె పాణులఁ గప్పి గ్రిక్కునన్
దొలఁగుట మేలు దచ్ఛ్రవణ
దుష్కృతి వాపఁగఁ గోరి రేనియున్. 383

వ. అని పలికి రంత. 384

తే. పలుమఱును చైద్యుఁ డాడుదుర్భాషణములు
కృష్ణవిద్వేషులకుఁ జాలఁ బ్రియము లయ్యె
నంతఁ గ్రోధాగ్ని కిది వేళ యగు నె యనుచు
గంధవహసుతు వారించె గంగపట్టి. 385

వ. అప్పు డాశిశుపాలుండు భీష్ము నవలోకించి. 386

ఆ. వాయుతనయు నేల వారించెదవు భీష్మ
శౌర్యధైర్యధుర్యచండమునను

వీఁడు బాలుఁ డీవు వృద్ధుండ విద్దఱుఁ
గదనధరణి నెదురఁగలరె సన్ను. 387

ఉ. ఈసున సీసభాస్థితమ
హీతలవల్లభతల్లజౌఘముల్
బాసటగా సనుం దోడరి
బాహుబలంబునఁ బోరఁ జూచెదో
వాసిగ నట్ల సేయు మగ
వాఁడవయేని మెఱైన నాదుబా
ణాసనముక్తబాణహతి
నంతకుపోలు గనంగఁ జేసెదన్. 388

వ. అని పల్కి స్వపక్షక్షత్రియుల నెల్లం గూర్చుకొని యుద్ధసన్నద్ధుండై యుండె నంత భీమార్జుననకులసహదేవులునుం గదనంబునకు నాయితంబై రప్పు డక్కలకల్లంబాలించి ధర్మనందనుం డయ్యాగంబునకు నంతరాయంబు సంధిల్లె నని చింతించిన నావగానందనుం డతని కిట్లనియె. 389

ఉ. యాగఫలప్రదాయకుఁడు
యాగమయుండును నైన కృష్ణుఁ డీ
యాగముఁ గాచుచుండఁగ నృ
పా యెుకవిఘ్నము గల్గనేర్చునే

యాగరుజాంకుఁ డిప్పుడ దు
రాత్మునిఁ జైద్యుని నుక్కడంచి యీ
సాగరమేఖలాభరము
నయ్యనఁ జూపుఁ గలంగ నేటికిన్. 890

వ. అని బోధించె నంత దుర్యోధనుండు గర్ణుం జూచి. 891

క. సమయం బబ్బెను మనకుం
గ్రమమున మనసేయ నున్న కార్యంబు నృపుల్
దమపనికై చేసెద రీ
యమితబలుల గెలువ నేరికయినను దరమే. 892

వ. మనబలం బెల్ల నొక్కడఁ జేర్చికొని శిశుపాలుం గలసి
నిలుతమే యనినఁ గర్ణుం డిట్లనియె. 893

తే. ఇదియె కర్జమ్ము సుమ్ము మహీంతలేశ
తొడగి యీరాజసంఘంబుతోడఁ గూడి
పాండవేయుల గెల్చి యఖండమహిమ
నిపుడ తద్రాజ్యము హరింపు మేల దలఁక. 894

వ. అనియె నంత ద్రోణుండు దుర్యోధనుం జూచి. 895

ఉ. ఏల దురూహ నేసెదు మ
హీశ్వర ధర్మపరుండు ధర్మజుం
డేల నలంగు దుష్టనృపు
లెల్లఁ గ్రమంబున నంబుజాక్షువేఁ

గూలఁగ నున్నవారు హరి
కుంభినిభారము బాపఁ బూని యీ
పోలికఁ బుట్టెఁ జైద్యనృపు
పోఁడిమియుం జెడు నీక్షణంబునన్. 396

తే. అని నివారించె నంత శతాపరాధ
పూర్తి యగునంత దమఘోషపుత్త్రుఁ డనుచుఁ
దలఁచు వసుదేవనందను తలఁపుబడిన
వచ్చి చక్రంబు తత్పార్శ్వవర్తి యయ్యె. 397

శా. అంతం గృష్ణకరాగ్రముక్తమయి యు
ద్యద్భానుకోటిప్రభా
క్రాంతానంతదిశాంతమై నిగిడి చ
క్రం బన్యరాజన్యదు
ర్దాంతప్రక్రియ నేఁగి చేదివిభుమ
స్తంబున్ వెసం ద్రుంచెఁ ద
త్క్రాంతారాతివసుంధరాధిపులు వి
భ్రాంతాత్ములై తూలఁగన్. 398

ఆ. విరులవాన గురిసె మిన్నును దిక్కులుఁ
దెలివిగాంచె మించెఁ ద్రిదివవేశ్య
లాడి రుచితగతులఁ బాడిరి గంధర్వ
పతులు చైద్యనృపుఁడు పడినయంత. 399

క. ఆయెడ నాశిశుపాలుని
కాయములోనుండి యొక్కఘనతేజము నా
రాయణునిఁ జొచ్చె యాగస
మాయాతసమస్తజనము లచ్చెరు వందన్.

సీ. అప్పుడు ధర్మజుం డవనీసురక్షత్ర
సంఘంబునకుఁ బూజ సంఘటించి
యట వసిష్ఠుండు పూర్ణాహుతి గావించి
యాగశేషక్రియ లాచరింప
నవభృథస్నానపూతాత్ముఁడై సన్ముని
గణముల నుచితదక్షిణలఁ దనిపి
యఖిలబంధుజనాళి కర్థిఁ బూజ లొసర్చి
మెలమి నిజస్థానములకుఁ బనిచె
నట్లు కృతకృత్యుఁ డగు సన్మహామహీశు
క్రతువుచేఁ దృప్తుఁ డగుచుఁ బురందరుండు
పాండునరపాలశేఖరు భవ్యతగ ని
జాసనార్ధంబుసం దిడి యాదరించె.

వ. కృష్ణదేవుండును శిశుపాలదంతవక్త్రాది దుష్టజనంబులఁ
ద్రుంచి ధరణీభారంబు వారించుచు బంధుజనపూజితుండై
బలభద్రసహితంబుగా నిజపురంబునకుం జనియె నిట్లు. 402

తే. జయవిజయులఁ బ్రసాదభాజనులఁ జేసి
సిద్ధజేగీయమానప్రసిద్ధమహిమ

నలరి ద్వారకలోపల నధివసించె
నఖిలలోకప్రభుండు చక్రాయుధుండు. 403

క. ఋషిశాపము లగు జయవిజయులు
ద్విజశాపం బెడలి దివ్యదేహాకలితు లై
నిజసుకృతవశంబునఁ జని
భుజగశయనుపార్శ్వచరతఁ బొలిచిరి మరలన్. 404

క. ఈయుక్తమకథ వినినను
ధీయుతులకు రుజలు తొలఁగుఁ దేజఃకీర్తి
శ్రేయోభివృద్ధి దనరుం
బాయుం గలుషములు విష్ణుభక్తియు నొసరున్. 405

వ. అనిన విని నైమిశారణ్యవాసులు వ్యత్యస్తరామనామప
రాయణుం డగు చోరుని తెఱం గెట్టి దయ్యె నని యడిగిన.

శా. షట్కంజాంతరతత్త్వవిన్మునిజన
స్వాంతాంబుజానందకృ
త్త్వట్కంజాస్త్ర భవా భవాబ్ధితరణీ
దిఙ్మండలీచేల పా
స్ఫుట్కల్లాంబుదనీలకంధర ధరా
భృద్భూరిచాపా బల
ద్విట్కుంభి ద్యునదీ సుధానిధి సము
ద్దీప్తావదాతాంగకా. 407

జ. సురవరనరతిర్యక్స్థా
వరనానాజంతుపూర్ణఘనజఠరభాండ
స్థిరఫలకలితశరీర
స్ఫురదురుయజ్ఞాంగ సూత్రశోభితగంగా. 408

కలహంసవృత్తము.

యమిజనామ్నాయహృదయాబ్జనివాసా
ప్రమథనాథ హిమపర్వతపుత్రీ
రమణ భక్తజనకాంక్షితదానో
ద్యమనురాగము, మహాగమవేద్యా. 409

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యీడులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునందు
సప్తమాశ్వాసము.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



అష్టమాశ్వాసము



శ్రీగౌరీపదలాక్షా
యోగాపాటలగురుకాయా
యోగినికురుంబకాంత
ర్యాగార్చిత గగనకేశ హార మల్లేశా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిమునిముఖ్యుల కిట్లనియె న ట్లచ్చో రుండు తపంబుసేయుచుండ ననేకమన్వంతరంబులు గడ చినయనంతరంబ తుల్య భరద్వాజ గౌతమ వృద్ధగౌతమ కౌశికవసిష్ఠాదు లైన మహర్షులు పదివేవురు శిష్యులుం డారును హిమశైలంబు డిగ్గి యమ్మార్గంబునన జను దెంచుచు. 2

క. ఎడ నెడ శివ శివ యనుచున్
బడి బడి శ్రీరామ, రామ, పాహి, యనుచు నిం
పడరంగ వేదోక్తవిధుల్
గడు వేడ్క జగద్ధితార్థమరిమ వొడువ్వుచున్. 3

ఉ. అంగపరిశ్రమం బడర
నమ్మునిపుంగవు లప్పథంబునన్
జంగమవేదశాస్త్రముల
చందమునం జని కాంచి రొక్కచో
రంగదభంగసౌరభవి
రాజితపుష్పఫలాభినమ్రనా
రంగలవంగలాంగలిక
కంటకముఖ్యమహీజవాటికన్. 4

ఉ. భృంగమయూరకీరపిక
పేశలసూక్తులు ముక్తికామినీ
సంగతివైఖరుల్ దెలుప
సంయము లత్తరువాటిఁ జొచ్చి త
న్మంగళవృక్షమూలతల
మంజులవేదుల విశ్రమించి రం
తం గడుఁజల్లనై మలసె
దక్షిణదిక్పవమానడింభముల్. 5

ఉత్సా. పారిజాతమాతులుంగపనసకదళికామ్రమం
దారనారికేళముఖ్యధరణిజాతజాతముల్
సౌరతరుల కెన యనంగఁ జాలు మేలు సెలయ నిం
పారు తత్ఫలములు చేత నందికొనఁగ ననువగున్. 6

క. తృణగుల్మరహితమై ద
ర్పణసన్నిభవిమలధరణి భాసిల్లుచు నీ
క్షణపర్వనిర్వహణతరు
గణముల నొప్పారు నది జగన్నుతమహిమన్. 7

క. ఆవిజయాహ్వయచోరుత
పోవిస్ఫూర్తికిని బెగడి భూతము లైదుం
బావనమతి సృజియించిన
యావనివిభవంబుఁ బొగడ నజునకుఁ దరమే. 8

ఆ. జాతివైర మెడలి జంతుసంతతి మహో
దారమైత్రి నలరఁ దద్వనంబు
విబుధగణనితాంతవిహరణస్థానమై
యఖిలసౌఖ్యహేతు వగుచుఁ దనరు. 9

తే. దేవవల్లభమహిళాప్రదీప్త మగుచుఁ
బ్రబలసుమనోమనోజ్ఞరంభావిలాస
శోభితం బయి యవ్వని చూడ నొప్పు
నందనవనంబుగతిఁ గడు నంద మగుచు. 10

సీ. హరినీలనీలబంభరడింభనికరంబు
చొప్పు పెన్నెఱివేణియొప్పు నెఱప
నరుణారుణస్ఫురదురుపల్లవశ్రేణిఁ
గెంగేలిపోలిక గేలుకొనఁగ

సచ్ఛాయచ్ఛత్రరుసుమగుచ్ఛవిలాసంబు
గల్పించఁగ్లుచ్ఛలయుమొప్పఁ దెల్ప
మంజులలతికాసమంజసవైఖరి
రంగైన మునితెలుంగు దోఁప

తే. నవమకుసుమవిలాసంబు హాసలీలఁ
దనర నిశ్శ్రేయసాంగనం దార్ఛ్యసెట్టి
శంబళ్ళియుబలె వనలక్ష్మి సంయములకు
సలలితామోదవిస్ఫూర్తి సంఘటించె. 11

సీ. నానావలాశసంతానాన్వనం బయ్యు
సుమనఃకదంబ విస్ఫురణఁ దనరి
మన్మథవిభ్రమమహిమ రంజిల్లియు
నీలకంఠశ్రీమనిరతి వఱలి
పల్లవరాగసంపద్భాసురం బయ్యు
ద్విజవరవ్యాహృతవ్యాప్తిఁ దేజరిల్లి
యవిరతమధుపకులానక్తిఁ జెందియు
సత్పురుషారాగమూర్తిఁ దనర్చి

తే. నవ్యపుష్పితగణికానవాథవరయ్యు
సతతపున్నాగసంగతి నతిశయిల్లి
వెలయు నయ్యాశ్రమారామవిపినరాజి
గాంచి మునివర్యు లచ్ఛకౌతూహలులగుచు. 12

ఆ. నందనంబు కర్మబృందానుసారిత
సంఘటించు భోగసముదయంబు
జంతువితతి కిలన సౌఖ్యంబు లొనగూర్చు
నిదియె నందనమున కిక్కు డగుచు. 13

ఆ. నందనంబు జనమనస్థానసంధాన
తారతమ్యభోగదంబు గాని
యెవ్వనంబుకరణి నెల్లజంతువులకు
ననిశసౌఖ్యహేతు వగును తలఁప. 14

మ. అని వర్ణించుచు మౌనిపుంగవుఁడు శి
ష్యవ్రాతముల్ దాఁదు స
ద్వనభూజంబులలోనఁ గ్రొమ్మెరయు భా
వంబుల్ మహాశ్చర్యస
ద్వసథిం దేలఁగ హాళి నొక్కెడయెడ స
ర్వప్రాణిలోకైకవిశ్రా
మానమాకందమహీజమూలమునఁ జె
ల్వార స్సమాసీనుఁడై. 15

తే. కొంద అందంద ఫలమూలబృంద మర్థి
రాసులుగఁ జేసి రవుడు పేరాసకలిమిఁ
దృప్తి నొందక కొందఱు దిరుగుచుండి
రన్యసిపిపీలికాపఙ్క్తి యలముకొనఁగ. 16

క. ఆమునిముఖ్యులు గొందఱు
కామక్రోధాదిలోభకలితాత్మకులై
వేమఱు వాదించిరి తా
రామ్నాయ ఫలమూలసంగ్రహావసరములన్. 17

వ. తదనంతరంబ వారలందఱు స్నానసంధ్యాద్యుచితవి
ధులు దీర్చి ఘనసారగంధబంధురంబులును సుధామధు
రంబులు నైన ఫలమూలంబుల నాహారకృత్యంబులు
నిర్వర్తించి పరితృప్తులై పురాణపఠనశ్రవణాదిసత్కథాప్రసం
గంబుల సద్గునశేషంబు గడపి రాత్రి యగుడు నిద్రించు
చుండి రంత. 18

సీ. మహితతపఃక్రియామహిమచే మూర్తిమ
ద్దీప్తిహోత్రంబనిభాతి వెలయువానిఁ
జిత్తనాశకకర్మముల్ శ్రీరాముసందిడి
తన్మయత్వంబునఁ దనరువానిఁ
గార్శ్యంబుఁ జెందిన గాత్రంబుచే ద్వితి
యాచంద్రరేఖ నాఁ దలరువానిఁ
బుటపాకమున శుద్ధిఁ బొరసినకనకంబు
గతి నకల్మషలీలఁ గ్రాలువాని

తే. నిర్జితక్రోధకాముఁడై నెగడువాని
నఖిలజీవప్రియంకరుం డైనవాని

మౌనిపుంగవు నొకని సమస్తమునివరులు
స్వప్నమునఁ గాంచి రపుడు సుస్వప్నదృశులు. 19
వ. మఱియు. 20
శా. ఆమౌనీంద్రునకు న్వరం బొసఁగ న
భ్యర్ణక్షితి న్నిల్చు శ్రీ
రాముం డైవతసార్వభౌము దనుజేం
ద్రవ్రాతభీము స్ఘన
శ్యాము న్సర్వగుణాభిరాము రఘువం
శాంభోధిసోము న్బలో
ద్దాముం బావననాముఁ గన్గొనిరి సీ
తారాము నాసంయములు. 21
సీ. నిరుపమసౌందర్యనిర్జితపంచేషు
హారకిరీటకేయూరభూషు
మందస్మితాంచితసుందరాస్యవిలాసుఁ
బృథులకాంచనమయపీతవాసు
సనకాదిసన్మునిసముదయసంభావ్యు
భరతలక్ష్మణముఖభ్రాతృసేవ్యు
శ్రీకరభక్తలోకైకరక్షణదక్షు
మందారసుమదామమహితవక్షు
తే. రాము శతకోటిభాస్కరధాముఁ గాంచి
మేలుకొని రామునాతఁడు మౌనులు మనుచు

హర్షపరవశు లగు నమ్మహర్షులకును
క్షణసమానాశులీల నాక్షణద చేఁగ. 22

వ. అంత స్నానసంధ్యాదికాల్యకరణీయంబులు నిర్వర్తించి
సభమై కూర్చుండ వారలకడకు నారదమునీంద్రుం
డేఁగుదెంచిన నందఱుఁ బ్రత్యుత్థానంబుచేసి యర్ఘ్యపా
ద్యాదిసత్కారంబు లాచరించి బహూకరించి సుఖాసీనుం
గావించి రందు వసిష్ఠమునీంద్రుం డమ్మునీంద్రునితో
ని ట్లనియె. 23

ఉ. ఎవ్వనియాశ్రమం బిది ము
నీంద్ర! మహేంద్రవనంబురీతిఁ బా
నివ్వసుధం గరం బలరి
నీడిన సౌఖ్యగనూనసమృద్ధిచే
నివ్వని విశ్వకర్మ రచి
యించెనొ కాక మయుం డొనర్చెనో
యవ్విధ మంతయుం దెలిపి
యందఱ కింపు ఘటింపఁ జేయవే. 24

క. పదునాల్గులోకముల నిం
పు దలిర్పఁగ సంచరించు ప్రోడవు నీకుఁ
విదితం బశేషవృత్తం
బది గావునఁ దెల్పు మివ్వనావనిమహిమల్. 25

వ. అని పలికి యంతియ కా నొక్కవింత విను మని యిట్లనియె.

క. అస్వప్నమానివర మా
సుస్వప్నములందు నొక్కశుభచారిత్రుస్
భాస్వత్ప్రభుఁ గంటిమి రా
మస్వామిగ మది భజించుమహితాత్మకునిన్. 27

శా. అత్యంతస్థితి రామనామజప మ
త్యాసక్తిమైఁ జేయుచున్
సాక్షాదగ్నియపోలెఁ గ్రాలెడు ముని
స్వామిం గృపం బ్రోవఁగా
సాక్షాత్కారముఁ జెందు రాఘవుని వి
శ్వత్రాణపారీణు భ
క్తశ్రేయంకరుఁ గంటి మిందఱము మా
కన్నుల్ గడుం జల్లఁగన్. 28

వ. అని స్వప్నవృత్తం బెఱింగించి వెండియు. 29

ఆ. అనఘ రామ రామ యనుమధురస్వరం
బిపుడు వినఁగ నయ్యె నివ్వనమునఁ
దజ్జపంబు నల్పుధన్యునిఁ బొడఁగాన
మఖిలతరువులందు నరసి యరసి. 30

ఆ. అమనోజ్ఞమృదురవాకర్ణనమునఁ బ్ర
మోదవార్ధిఁ దేలి మునిలలామ,
యొండు-చోటి కరుగ నుల్లంబు గొలుపక
యుంద యున్నవార మిందఱమును. 31

క. ధరఁ బుణ్యక్షేత్రమునకు
నరిగినగతి నలరె మానసాబ్జములు మునీ
శ్వర యిన్వని మును చూచిన
కరణిం గనుపట్టెఁ బ్రీతి గదిరె న్మామునా. 82

వ. ఈకారణం బేమిటో యింతయుం దెలియ వివరింపు
మనిన నద్దివ్యముని యిట్లనియె. 83

సీ. ఎఱిఁగింతు మునులార యితిహాస మొక్కటి
శ్రోతల కత్యంతశుభకరంబు
సర్థార్థులకు నిఖిలార్థప్రదంబును
బుత్రార్థులకు బహుపుత్రదంబు
భుక్తిముక్తిప్రదంబు నపారసంసార
తరణంబు వినుఁడు చిత్తంబు లలర
మున్ను నేఁ గైలాసమునకు మహేశు జ
గత్పతి సభను శంకరునిఁ జూడఁ

తే. గోరి యరిగితి నరిగి తద్ద్వారసీమ
నతులబలదీప్తులైన శశాంకమకుట
కింకరావళి వారింపఁ గెలన నిల్చి
యుంటి సహోన్మాదమున నటు లుండునంత. 84

ఉ. శంకరకింకరాళి తెఱుఁగ
నత్యుత్సవం గని ప్రాజ్ఞ వల్ప నీ

క్కంతఁ బ్రదక్షిణించి నుతి
 సల్పి నమస్కృతిపూర్వకంబుగాఁ
బొంకములో నతండు నొక
 పుష్కరయానవరాధిరూఢుఁడై
శంకరసన్నిభుం డగుచు
 శాంతరభూమికిఁ బోల్చ గ్రక్కునన్. ౩౫

మ. అతనిం గన్గొని యాతఁ డెట్టిసుకృతం
 బార్జించెనో యెట్టిసు
వ్రతముల్ సల్పెనొ శంభుకింకరు లుదా
 రప్రీతి సర్పింప నీ
స్తుతిఁ గాంచెం దగు నంచు నెంచి తదనూ
 సన్నిద్ధతేజోబలో
ద్ధతికిం బ్రీతిలి యొక్క పల్కె తి నిత్యాం
 తప్రీతి సంధిల్లఁగన్. ౩౬

ఆ. ఓమహాత్మ యెట్టియుగ్రతపం బొనరించి
 తేమి పూజ సల్పి తెట్టితీర్థ
యాత్ర సల్పితివి కృతార్థుఁడవై తెట్టి
 దాన మిచ్చి తీ వనూనమహిమ. 37.

క. * ఏసుకృతమహిమమునఁ గై
 లాసావాసుండవై చెలంగితి వీటు ము

---

* ఏసుకృతముచేఁ గైలాసావాసుఁడవై చెలంగితి విటు—వా. ప్ర.

స్నసుకృతుల కైన శివా
వాసము దుర్లభము ప్రమథవర యూహింపన్. 38

క. ఘోరపిశాచనిశాచర
వీరులకుం గ్రూరులకును వీక్షింపఁగఁ జె
న్నారఁగ నంట నశక్యము
తారక శైలంబు ప్రమథతతికిం దక్కన్. 39

వ. నీ వేమి పుణ్యంబునఁ గైలాసయుతుండ వైతి వెఱింగిం
పు మనిన నాకు నతం డిట్లని చెప్పె. 40

మత్త. ఏను పూర్వభవంబునందు మహీసురుండ ఖలుండ దు
ర్ధానవస్తుతతిప్రతిగ్రహదర్పితుండ నిరాకృతిన్
మానిపుంగవ విప్రకర్మము మాని శూద్రకులోచితం
బైనధర్మమునం జరింతు దురంతదుష్కృతకారి నై. 41

తే. బంధకీతతసురతసంబంధపరతఁ
బలితపాషండదుర్జనప్రతతిఁ గూడి
సతతవృజినదుర్మదవసంతమూర్తి
నగుచు విహరింతు నార్యులం నను నగంగ. 42

క. ఈరీతిఁ గల్మషంబు ల
పారముగా నాచరించి పదపడి నేత
త్కారణమునఁ గిటికరటి
ఘోరశునకజనికశాప్తిఁ గొఱలితి ధరణిన్. 43

మత్త. ఘోరజన్మము లెత్తి యాగతిఁ గుంది కర్మవశంబునన్
దూరసంచరణాతిశక్తియు దూరదృష్టియుఁ గల్గి చె
ల్వారుగృధ్రమనై జనించితి నంత నోమునిముఖ్య త
ద్ఘారుణాకృతిఁ గాంచి భూతవితానముల్ వెఱఁ గందఁగన్.

వ. అంత ననేక కాలంబు గడచినయనంతరంబున. 45

తే. ఆమిషార్థినై ఘోరవనాంతరమున
దిరిగి యచ్చట నాహార మబ్బ కునికి
క్షుత్పిపాసలచేఁ గడుఁ గుంది యంత
నొక్కదేవాలయమునకుఁ నొయ్యఁ జేరి. 46

మాలిని. ధవళఖగవిభాస్వద్వజ్రలేపస్ఫురత్త
ద్భవభవనసమంచ ద్భర్మకుంభంబుపైఁ బ్రా
గ్భవకృతసుకృతౌఘప్రాప్తిచేఁ జిక్కి యం దా
సవిధవివిధతిర్యక్సంతతిం జూచుచుండన్. 47

ఉ. ఆసమయంబునందు మృగ
యారతిచే నొకలుబ్ధకుండు బా
ణాసనబాణపాణి విల
యాంతకుఁ బోలికి నేఁగుదెంచి యు
ల్లాసదృశాశుగంబునఁ జ
లంబున నేసె మహేశ్వరాలయా
భ్యాసితశాతకుంభకల
శాగ్రసమాశ్రితతద్విహంగమున్. 48

క. వ్యాధధనుఃప్రేరితశర
బాధం గలంగి పూర్వపుణ్యపరిపాకమునన్
సాధ్వి ధరవుత్రికముతో
స్వర్భాగ్యాగారంబుచట్టుం దిరిగితిం గొలుచన్. 49

ఆ. అటం బ్రదక్షిణత్రయానంతరమున న
ప్పక్షితనువుం దొఱంగి యాక్షణమున
దివ్యతనువుం దాల్చి దివ్యగంధాంబర
భూషితుండ నైతి బుధులు పొగడ. 50

వ. ఇట్లు బలాత్కారకృతశివప్రదక్షిణభావంబున నప్సరోగ
ణసంకీర్ణంబైన దివ్యవిమానం బారోహించి తేజఃపుంజ
రంజితసకలదిఙ్మండలుండనై గంధర్వగానంబు వినుచు
విద్యాధరకదంబంబులు గొలువ నాకలోకంబునకుం జని
పురందరాదిబృందారకబృందంబులచేతం బూజితుండనై
చిరాయు వనునామంబున ననేకకాలం బందు వసియిం
చితి ననంతరంబ యొక్కనాడు ప్రసంగవశంబున దివ
స్పతి వాచస్పతి కిట్లనియె. 51

మ. అతులానందకరంబు నందనవనం
బారామ, మిరాదేవతా
ప్రతతుల్ గింకరు, లద్రిభేది పవి శ
స్త్రము, బీశచీదేవి సు

తనతి, స్వర్గంబు పురంబు, సద్గురుండ వెం
డ నీవు నా కిట్లు శా
శ్వతసామ్రాజ్యయుతుండ నేనకద జే
వా ఖ్యాతి త్రిలోకంబునన్. 52

క. అనవుడు నీయైశ్వర్యం
బనిత్యతాహేతువునఁ గిరియాజనితముగా
ననుమేయింపం దగినది
ఘనవాహన యనుచు నతఁడు గ్రమ్మఱఁ బలికెన్. 53

వ. అప్పలుకులు విని యైశ్వర్యతారతమ్యగణనాప్రసంగం
బున సభ్యులకు వివాదం బైన నీవివాదశాంతిఁ గోరి
పురోహితబోధితుండై పురుహూతుండు సభ్యులుం
దానును మత్సన్నిధి కేతెంచి తద్వృత్తాంతంబు వివరిం
చిన సకలశాస్త్రసమ్మతంబుగా నే నిట్లంటి. 54

క. పొందుగ విభవంబు క్రియా
బృందజ మస్థిరము శక్ర వృథుండైతన్యా
*నంద మొకటియు నకర్మజ
మిం దనుమేయంబుగా దక్షిణాస్యప్రోక్తిన్. 55

సీ. దృశ్యత్వకారణస్థితిచేత సఖిలంబు
నస్థిరం బగు సమురాధినాథ

* (1) నంద మొకటియు నకర్మజ, మందను మేయంబు — అని యొక వ్రా. ప్ర.
(2) నందం బొకటియు నకర్మజ, మందనుమేయంబు — అని తక్కిన వ్రా. ప్ర.

పదుమువ్వురింద్రుల బ్రకటితైశ్వర్యంబు
గనుఁగొనినాఁడ నాకన్ను లలరఁ
నంతంత కనువయ్యె నవలి శతమ్రిలసిరి;
యాదృశక్రునిసతి కైనఁ గచికిఁ
బరిచారికాకృతిఁ బరఁగ నిప్పటి కచి
యిది యంతయును నాకు విదిత మయ్యెఁ

తే. గాలయుగధర్మభేదముల్ గలుగు నిట్లు
యప్పుడప్పుడు ప్రాణుల కదియె *యిచటఁ
బరమసౌఖ్యంబుగాఁ గనుపట్టుచుండు
ననుచుఁ బల్కిన విని యిందుఁ డనియె మరల. 56

తే. ఇవ్వివాదంబు శాంతించె నింక నొకటి
యడిగెద శివప్రదక్షిణం బాచరించి
యేఫలము గాంచు మనుజుఁ డహీనఫణితిఁ
దెలిపి యీసంశయం బెల్లఁ దీర్పు మనఘ. 57

వ. అనిన నే నిట్లంటి. 58

ఉ. ఏ మును గృధ్రదేహి నయి
యీశ్వరమందిరసత్ప్రదక్షిణం
బామెయి వ్యాధబాధితుఁడ
నై యొనరించితిఁ బానఁ జేసి శే

* యిచట—ప్రా. ప్ర.

నీమెయి దాల్చి యిందు వసి
యించితి నింపమరం జిరాయు వ
న్నామముతోడ శక్ర పదు
నల్వురు శక్రులు దీఱునంతకున్. 59

క. నావిభవము గనుఁగొని శివ
సేవాఫల మెఱుఁగు మనిన విష్ణుఁడు శితికం
ఠావాసమునకు వలగొను
శేవ గడిందిగఁ దలంచె డెందం బలరన్. 60

వ. అని ఇంద్రాదులసంవాదంబు వివరించి వెండియుఁ జిరా
యు విట్లనియె మునీంద్రా యిట్లు త్రిదివలోకంబున
వసియించినకాలంబు నాకొక్క దినం బయ్యె ననంతరంబ
వైకుంఠభవనంబున కేఁగి యచ్చట దివసద్వయంబు
నిలిచితి నంతఁ బుణ్యగౌరవంబున నీకైలాసంబున కేఁగు
దెంచితి ననిన నే నిట్లంటి. 61

తే. హరునకుఁ బ్రదక్షిణత్రయం బాచరించు
కారణంబునఁ గైలాస గమన మబ్బె
నీకు వైకుంఠభవనాదిలోకములకు
నెట్టిసుకృతంబుచే నేఁగి తెఱుఁగఁ జెపుము. 62

వ. అనినం జిరాయు విట్లనియె. 63

తే. హరునకుఁ దిర్యక్కులకు భేదబుద్ధి లేదు
దూషణము దానిమూల మాదూషణంబె

యఖిలధర్మవినాశంబు నాచరించు
వివిధలోకవిరోధియై విస్తరిల్లు. 64

క. ధర దూషణంబు వెలిగా
నరుఁ డేధర్మంబు చేసిన స్సఫలతచే
నిర వొందు సర్వలోక
స్థిరగమనము గన నిదియెంగఁ జెప్పితి నీకున్. 65

వ. అనియె నని చెప్పి సూతుండు. 66

క. ఈపుణ్యచరిత మెవ్వం
డేపున విను శ్రద్ధ గలిగి యుద్ధరఁ బుణ్య
శ్రీపటిమ వెలయు నాతఁడు
పాపవిముక్తుఁ డగుచు పరమపదముం జేరున్. 67

వ. అని చెప్పి నారదుండును వసిష్ఠాదుల కిట్లను నట్లచ్చిరా
యువుసకు మ్రొక్కి యతం డనువ వెండవద్వారంబుం
బ్రవేశించితి నంత. 68

శా. హీరద్వారకవాటదీప్తములు బం
హిష్ఠాద్భుతముక్తామణి
స్ఫారోల్లాభవిభాసురంబుఁ గుముదా
ప్తప్రస్తరాబద్ధమై
దీరమ్యంబును నై పొసంగి ప్రతుషా
ధిష్ఠానమై యొప్పు న

ద్వారం బింపు ఘటించెఁ గన్గవకు సాం
ద్రశ్రోత్రోత్సవచండడిండిమరవన్. 69

శా. అందు న్వజ్రవిశుద్ధవిగ్రహు విశా
లాత్ము న్మహాబాహుఁ బ
ర్వేందుప్రోజ్జ్వలసుందరాస్యుఁ బ్రమథా
ధీశప్రభావు న్సదా
నందుం జిత్రరథాభిధాను నొకపెన్
గానాద్యవిద్యాఢ్యు నా
డెందం బెంతయుఁ బ్రీతిచేఁ బొదలఁ గాం
టిన్ రత్నపీఠస్థితున్. 70

తే. అతఁడు శివనామకీర్తనం బాచరించి
వీణఁ బలికింపఁ దచ్ఛ్రుతివిలసనంబు
నాశ్రుతిపుటద్వయీరంజనం బొనర్చి
యలఘురోమాంచకంచుకితాంగుఁ జేయ. 71

క. నతిచేసి యతనిచే స
త్కృతియు నమస్కృతియుఁ బడసి స్థిరతరనికట
స్థితపీఠమునఁ దదాజ్ఞం
గృతమతి వసియించి యతని కే నిట్లంటిన్. 72

శా. ఈదైశ్వర్యమహానం జెలంగుటకు నీ
వేదేవునిం గొల్చి తి

వేఱే కర్మము లాచరించితివి ము
స్కాంతే ధృతి స్ఫీకర
స్థాయుష్వల్లకి దాని వల్కాడి శివాం
చన్నామముల్ చంద్రికా
ప్రాయంబై తగు నీదుమూర్తిఁ గని నా
భావంబు పొంగెన్ రహిన్. 73

వ. ఏసుకృతంబునకతంబున నీకీమహిమంబు గలిగె నెఱింగింపు
మనినఁ జిత్రరథుం డిట్లనియె. 74

ఉ. ఏ మను సామదుం డను మ
హీసురుఁడం గడు దుర్వినీతిచేఁ
గామశరాప్రగల్భగణి
కారమణీగృహాసీమలన్ విట
గ్రామణి నై మెలంగుదు సు
కర్మము లెవ్వియు నాచరింప నెం
తే మదలీల నార్యజన
నిందయుఁ జేయుదు నెల్లవేళలన్. 75

వ. మఱియు నాయుర్వినాశకరంబులు నార్యనిందితంబులు
నగుదుష్కృతంబు లనేకంబు లాచరించితి నంత నొక్క
నాఁడు సహచరులం గూడి కార్యాంతరవ్యాసంగంబునఁ
బురవీథి నరుగుచుండి. 76

క. నవలక్షకుసుమములచే
నవనివిభుం డొకఁడు త్రిపురహరుఁ బూన్పఁగఁ బ్రా
గ్భవసుకృతహేతువునఁ ద
ద్భవనంబున కేఁగి యందు భావం బలరన్. 77

తే. అతఁడు కల్పోక్తవిధిఁ బూజ యాచరింపఁ
జూచుచుండితి దృఢతరశుద్ధబుద్ధి
నంత నాయుఃక్షయం బౌట యమునిబంటు
లరుగుదెంచిరి నాయిక్క యరసికొనుచు. 78

ఉ. ఆశివపూజ సల్పు నిల
యంబు చేరంగఁ దరంబుగాక కీ
నాశభటుల్ మనంబుల ఘ
నంబుగ భీతి వహించి తద్గృహా
భ్యాశమునన్ మదాగమన
మారయుచు న్వసియించి రద్రిజా
ధీశసమర్చనంబు తెఱఁ
గేను గనుంగొనుచుండ సత్వరన్. 79

తే. యక్షబేతాళవితతికి రాక్షసులకు
ఛిద్రమన్వేషణముచేయ చెనఁటులకును
మృడునిసన్నిధి నొక్కింత మెలఁగరామి
వెలుపలన నిల్చి రంతకవీరభటులు. 80

తే. వింటి శివనామపఠనంబు వీను లలరఁ
గంటి శివపూజసేయఁ జెంగట వసించి
దాన మృత్యువు దొలఁగె నత్రి మునీంద్రి
సజ్జనుల పొందు ధరఁ గల్పశాఖి యగుట. 81

క. నిరతము వైదికనిష్ఠా
నిరతుండై శ్రద్ధ గలిగి నిష్కల్మషుఁడై
పరగినహరపదభక్తుఁడు
స్థిరతరగతి వర్షశతము జీవించు మహిన్. 82

క. భవితవ్యతానుసారిత
భవపూజాపరిసమాప్తిపర్యంతము న
బ్భువి వసియించితి నంతం
బావులుచు యమభటులు మగిడి పోయిరి లజ్జన్. 83

క. శివనామకీర్తనంబును
శివపూజాదర్శనంబు శివదివ్యకథా
శ్రవణంబు నల్పనియమవి
ద్భవ మగు ఫల మనఁగరాదు పద్మజతనయా. 84

వ. అట్లు శివపూజాదర్శనమాత్రింబున బ్రిహ్మాదిదుర్లభం
బైన యీశరీరంబు ధరియించి కైలాసద్వారంబునందు
నుండం గాంచితి నని చెప్పి చిత్రిరథుం డనువఁ బ్రమథ
సంకీర్తనంబును విచిత్రమణికుట్టిమంబును నానామణిగణ

బద్ధవేదికంబును నైన తృతీయద్వారంబుఁ బ్రవేశించితి
నందు. 85

తే. తండుభృంగీశ్వరాదు లుద్దండలీల
శివదిదృక్షాసమాసక్తిఁ జేరువారి
భవునిదివ్యాజ్ఞ వెలిగ లోపలికి నరుగ
నీరు తద్ద్వారసీమ నెవ్వారి నైన. 86

శా. వేత్రిప్రస్ఫురితప్రహారకలనా
విద్యోతిచే నెంతయున్
సుత్రామప్రముఖామరౌఘముల సం
శుద్ధాత్ములం జేయుచుం
దత్రత్యుం డగు నంది నుజ్జ్వలమహా
నందిం దగం గాంచి నే
నత్రిస్థితి లోని కేఁగితి మహే
శాజ్ఞానుసారంబుగన్. 87

మ. ధరణీభృత్తనయామనోహరు సము
ద్యత్కోటీరజాష్ట్రబం
భురతేజున్ ద్రుహిణాండభాండదహనో
ద్భాతోల్లసద్భాతిసు
స్థిరరేఖాకలితు న్మణీమయమహా
సింహాసనస్థున్ సుధా

సురవంద్యుం బురవైరిఁ గాంచితి హరున్
సోమార్ధ*కోటీరునిన్. 88

ఉ. కాంచి సమస్కరింప గర
కంజుఁ డకుంఠదయార్ద్రవీక్షణం
గాంచి మదీయసత్ప్రణతిఁ
గైకొని కన్బొమ సన్నసేయ న
ప్పంచశరారియాజ్ఞఁ దదు
పాంతమునం దగఁ గూరుచుండి యెం
క్కంచుక కొంకుచుం గదిసి
యి ట్లని విన్నప మాచరించితిన్. 89

తే. స్వామి రెండవద్వారదేశంబునందు
చిత్రరథుఁ డనుప్రమథుఁడు విచిత్రవేషుఁ
గాంచి మును నెట్టిసుకృతంబు గారణముగ
నిట్టివిభవంబు నీ కబ్బె నెఱుఁగఁ జెపుమ. 90

వ. అని యడిగిన నతండును నవలక్షకుసుమశివపూజాదర్శ
నంబున నిట్టి యైశ్వర్యం బబ్బె నని చెప్పెఁ దత్పూజా
మహత్త్వం బానతీయవలయు ననిన నమ్మహాదేవుం డి
ట్లని యానతిచ్చె. 91

క. నను నెనరా హరి నెనసన్
మునివర యొక్కకరవీరమునఁ దగఁ బూజిం

---

* కోటీరునిన్ —వ్రా.ప్ర.

బినరుఁడు భద్రములఁ గనుఁ
బునరుద్భవదుఃఖవశత బొందదు వానిన్. 92

తే. కార్తికంబున నైన మాఘమున నైన
ననఘ వైశాఖమున నైన నచ్ఛకుడ్య
మృదులపల్లవతోరణప్రథువితాన
లలితముగ నొక్కగేహం బలంకరించి. 93

సీ. నియతుఁడై వ్రతి యందు నిల్చి హిరణ్మయ
ప్రతిమ గావించి తత్ప్రతిమయందు
హరి నైన నను నైన నావాహనము చేసి
భాసురాగరుధూపవాసితంబు
రంగవల్లీచిత్రరచితాంచితంబు నై
యమరున చోట్చటఁ బీఠమున నిల్చి
పటహవీణావేణుపటునిస్వనంబును
బుణ్యలస్తుతిరవంబును జెలంగఁ

తే. గలితపంచామృతాభిషేకంబు చేసి
లత్కుసుమములఁ బూజించి లలితధూప
దీప నైవేద్యములచేతఁ దృప్తి సేయ
వలయు వాక్కర్మనియమపరివర్తనమున. 94

వ. ఇట్లు ప్రతిదినంబును లత్కుసుమంబుల శివశంభుమహే
శాదినామంబుల నన్నును నచ్యుతానంతగోవిందాదినా
మంబుల హరిని జతుర్థ్యంతంబులుగా నుచ్చరించుచుఁ

బూజించి నిత్యంబును బ్రాహ్మణులకు భోజనంబు నిడు
నది యిట్లు చేసి నవమదివసావసానంబున. 95

చ. ప్రతి గడు ధర్మనిష్ఠుఁ డయి
వస్త్రయుగాంచితోన్నైన కాంచన
ప్రతిమ నగణ్యపుణ్యుఁ డగు
బ్రాహ్మణుఁ బూజయొనర్చి దాన మ
ప్రతిహతలీల నీఁ దగు ధ
రాతలదానపురస్సరంబుగా
ధృతి నిటు సేయుమానవుఁడు
దేవుఁడుగాక మనుష్యమాత్రుఁడే. 96

సీ. ప్రథమదినంబునఁ బద్మముల్ రెండవ
వాసరంబునఁ గలువలు తృతీయ
ఘస్రంబునను రక్త కరవీరములు నాలు
గవనాఁడు కుటజంబు లవలినాఁడు
చంపకప్రసవముల్, షష్ఠిదివంబున
మొల్ల లేడవదినమునను డెల్ల
గన్నెరు లష్టమఘస్రంబునను జాజి
లట గాంచనములు, దా నవలినాఁడు

తే. ప్రతిదినంబును లక్షపుష్పముల నిట్లు
పూజసేయంగవలయు నపూపజనేయు

నరుఁడు కైలాసవైకుంఠపురముల వసి
యించు శాశ్వతవైభవ మొసఁగ నొసఁగ. 97

వ. ఇది నవలక్షకుసుమపూజాప్రకారంబు మఱియు. 98

క. తులసీదళముల శ్రీఫల
దళనికరములం దిలాక్షతముల న్ననుని
మ్ముల్లఁ బూజించినధన్యుం
డిల జీవన్ముక్తుఁ డగు నహీనవివేకా. 99

తే. హరిహరులపూజ కంతరాయంబు సల్పు
నరుఁడు నవలక్షవర్షముల్ నరకవాసి
యగు నటులు గాన విష్ణుశివార్చనముల
కంతరాయము సేయఁ గా దనఘమతులు. 100

క. శివపూజ సేయు నరుఁడున్
శివపూజాదర్శనంబు సేయువతండున్
శివపూజాముదితుండున్
శివమతిఁ గైలాసమునకుఁ జేరుదు రనఘుల్. 101

వ. చిత్రరథుండును బూర్వభవంబునఁ బాపాత్ముం డయ్యు
శివపూజాదర్శనమహాత్మ్యంబునఁ బవిత్రుండై తత్కార
ణంబున నవద్వీపం బనుపురంబునఁ జంద్రవంశంబునఁ
జంద్రాంగదుం డనునామంబున భూపాలుండై ప్రభ
వించి వాసనావశంబున సంతతంబును శివపూజ యాచ
రించుచు నిఖిలభోగభుక్తిం జరితార్థుండై శతవర్షం

బులు జీవించె సంత సతనిం గైలాసంబునకుం దెచ్చు
టకుఁ బ్రమథులచేత సూర్యసంకాశం బగువిమానరత్నం
బనిచితి నవ్విమానంబు నారోహించి గంధర్వగానవినో
దితుం డై యప్సరస్సంఘంబులు గొలువ మత్సారూప్య
కలితుండును వీణాపాణియు నై యభ్రవీథి నరుగు
దెంచునప్పుడు. 102

ఉ. ఆయతకోటిభానుకము
బాప్తరుచిం బొలుపొందుతద్రథ
చ్ఛాయ కృతాంతువీటివయి
జానుగఁ బర్వఁగ నందు దుర్గతిం
బాయక క్రేఁగుమర్త్యులకు
బాధ దొలంగినఁ బొంగి యెవ్వఁడో
యీయనఘాత్ముఁ డిందు [illegible]
నిందలు మన్చ నధర్మవృత్తులన్. 103

తే. ఏమహాత్ము రథచ్ఛాయ యిందుఁ బర్వి
యింపుమీఱంగ మము సుఖయింపఁ జేసె
నామహాత్ముఁడు మము నారకాలయమునఁ
బాపుఁగా కని పల్కి రప్పాపు లపుడు. 104

ఉ. ఆపలుకుల్ వినంబడిన
యంత నితాంతకృపార్ద్రచిత్తుఁ డై

యూపరమోపకారి రథ
మచ్చటికి న్మరలించి నిల్వ న
ప్పాపులు నారకవ్యథలఁ
బాసి దివంబున కేఁగి రంత ని
ర్వాపితతేజులై యముని
వాసముఁ జేరరి తద్భటావళుల్. 105

వ. ఇట్లు చేరి నైవస్వతున కిట్లనిరి. 106

చ. అరదము నెక్కి యొక్క తరు
ణారుణసన్నిభుఁ డైనపూరుషుం
డరుగుచు నారకిప్రతతి
యార్తరవం బొనరింపఁ గాంచి తా
నరుగక నిల్చి నిల్చుటయు
నాతఁడు వీక్షణ మాచరించి యా
నరులు సుఖించి నాకభువ
నంబున కరుగ నిరుద్భుతంబుగన్. 107

క. యము రాజధాని నీసం
యమనీనగరంబు శూన్య మయ్యెన్ మే ము
య్యమవంతుఁ డెవ్వఁడో తెలి
యము దీనికిఁ బ్రతివిధాన ముల నెఱుపు మిఁకన్. 108

వ. అని చెప్పిన విని దండధరుండు దండాహతకుండలితెఱం
గునఁ గనలి యేతెంచి యద్దివ్యపురుషునిమూర్తిం గాంచి

తద్వినాశ్వాణితశివనామం బాకర్ణించి పిపాసార్తుం డమృత
పానం బాదరించినభంగిం బొంగి నమస్కరించి యతనితో
నిట్లనియె. 109

మ. శివనామామృతవర్షి వై యురుగు నీ
చేఁ బాల్పువీణారవ
శ్రవణానందము సీదునిర్మలకథ
చ్ఛాయాగ్రసరీరంభ వై
భవముం గ్రుంగఁ జేసి నాయకులు సం
ప్రాప్తామరావాసులై
భవబంధాఘనివృత్తులైరి సుకృత
భ్రాజిష్ణులం బోలుచున్. 110

తే. వెస మదీయాధికారంబు సీటఁ బోవఁ
బ్రమథవర పాదుచేసి లిప్పట్టసంబు
ధర్మమార్గరతుండ వై తనరు దీవు
ధర్మమర్యాద దాఁటంగ ధర్మ మగునె. 111

వ. ఇంక నే మెవ్వరిం దండింతు మెఱింగింపు మనినఁ జిత్ర
రథుం డతనితో డ. 112

సీ. కమనీయతరశివకల్యాణనామంబు
లనిశంబు పలుకనియట్టివారి
భూతియు రుద్రాక్షములు నంగములఁ దాల్ప
కత్యంతదురితాత్ము లైనవారి

ననయుంబు భిన్నమర్యాదచేఁ బెంపొంది
హరిహరదూషకు లైనవారి
నైదికాచారంబు వఱదపాలుగఁ జేసి
పాషండవృత్తిచేఁ బరగువారిఁ
తే. దస్త్రతైలకటాహమధ్యమునఁ బ్రోల్చి
కశలఁ బ్రహరించి ముద్గరాఘాతములఁ గ
లంపు మని తెల్పి యపుడ కైలాసమునకు
నరుగుదెంచెఁ గృతాంతుఁడు నరిగెఁ బురికి. 113
క. ఈసత్కథ చదివిన న
త్యాసక్తి న్వినిన మర్త్య లఘునివహములం
గాసి యొనరించి యట కై
లాసంబున నుండుదురు విలాసకలితులై. 114
వ. అని చెప్పిన నద్దేవునితో సర్వధర్మంబులలోన నుత్తమధ
ర్మం బెయ్యది యెఱింగింపు మనిన నయ్యీశ్వరుండు
నాతో నిట్లు లానతిచ్చె. 115
తే. సంయమీశ్వర వినుము సజ్జనులపొందు
తత్సహోభాషణంబు సత్యంతభక్తి
నారి సేవించుటయు వారి భూరిదాన
మానముఁ బోషించుట ముఖ్యధర్మంబు లవని. 116
తే. సాధుసంగతి గౌతమీస్నానమును శి
వార్చనంబును జేయుఁగా నగు నరుండు

చెలఁగి సాధుజనాళిఁ బూజించునేని
కలుగు ధర్మార్థకామమోక్షములు వరుస. 117

సీ. సాధుబృందములపార్శ్వప్రదేశముల ముం
దట వెన్క వసియింపఁ దగు నరుండు
సతతంబు సజ్జనసంగతిఁ జెంపొందు
నతఁడు దరించు భవార్ణవంబు
కుజనసంగతి గడుఁ గూల్చు నారకమున
మహా విషసంగతమనువుభంగి
నెట్టియాపద్వేళ నేనియు సత్సంగ
సంపరిత్యాగంబు సలుపఁ దగదు

తే. సాధు లెచ్చట నుండు రచ్చటను సముస్స
దివ్యతీర్థాస్పదం బయి శివదిల్లు
వార లెచ్చట శిథిలజీనసతిఁ బొలుతు
రచట దుర్భిక్షచోరబాధాను లడరు. 118

క. తుసు విదురుఁడు సత్సంగం
బున వైకుంఠంబుఁ బడసె భువి కాసీనం
దనుఁ డచట మోక్ష మెచ్చట
యనఘా సత్సంగమహిమ మలవియె పొగడన్. 119

తే. హరిహరులయందు సమచిత్తు లైనవారు
వైదికాచారరతుఁ లయినటులువారు

నాస్తికత గగ్గి శ్రద్ధచే నలరువారు
సజ్జనులుసుమ్ము నిర్జరసంయమీంద్ర. 120

వ. అట్టిసజ్జనులం బూజించుట పరమధర్మం బని తెల్పిన విని యేమి నిట్లంటి. 121

ఆ. శ్రుతివిరుద్ధకర్మరతు లైనబ్రాహ్మణ
క్షత్త్రవైశ్యశూద్రజాతములకు
నెట్టిగతులు గల్గు నెఱిఁగింపు లోకైక
నాథ శైలజాతనాథ యభవ. 122

వ. అనిన నీశ్వరుం డిట్లనియె. 123

ఉ. వేదవిరుద్ధకర్ము లగు
విప్రులు రాజులు నూరుజన్ములుం
మేదిని శూద్రబుద్ధు లయి
మ్లేచ్ఛజనిన్ జనియింతు రట్ల య
వైదికకర్మనిష్ఠల న
వార్యతపం బొనరించెనేనియుం
బాదభవుండు క్లేశములఁ
బాల్పడు సద్గతి లేదు వానికిన్. 124

వ. ఇట్లు చతుర్వర్ణాశ్రమంబులవారలును విపరీతకర్మంబు లాచరించి మ్లేచ్ఛులై జనియింపుదు రట్లు గావున నైహికాముష్మికఫలప్రాప్తిం గోరి స్వజాతివిహితం బగు కర్మంబు సేయువలయు నన్యధర్మంబు లాసరించినఁ

గీతాందు శూద్రుండు నిజధర్మంబు లైన విప్రసేవాదు
లవలనఁ దరియించు నందును స్వకర్మకర్తనులు పూజ్య
తము లని చెప్పిన నే నిట్లంటి. 125

క. హరుసన్నిధి దీపం బిడు
నరునకు నెట్టిఫల మబ్బు నగధన్వ మహే
శ్వర విన వేడుక య్యెడిఁ
దిరముగఁ గృప యుల్లసిల్లఁ దెలుపఁగవలయున్. 126

వ. అని యడిగిన నప్పరమేశ్వరుం డిట్లనియె. 127

తే. దీపదానమహత్త్వంబు దెలియ వినుము
సురమునీశ్వర యత్యంతశుభకరంబు
తత్ప్రభావంబుచేఁ బితృగణము వసించు
స్వర్గమున నాగకాలపర్యంతఁ దనరు. 128

ఆ. ఏతదర్థమైన యితిహాస మొకటి
గలదు దాని వినిన ఖలులకైనఁ
గలుషసముదయంబు దొలఁగు నిక్కువ మజ
తనయ వినుము సావధానముగను. 129

క. ఆదిన్ మందరుఁ డనునొక
భూదేవుఁడు గలఁడు గ్రూరబుద్ధియుతుండు సం
ధ్యాదివిరహితుం డన్య
స్త్రీనియుతుఁ డకృత్యకరణశీలుఁడు ధాత్రిన్. 130

ఉ. వేమఱు నార్యులం బరిభ
వించుఁ బరాన్నము మెక్కు నెప్పుడుం
బామరత న్మృషార్థములె
పల్కు నిషాదునిచేతనైనఁ దా
హేమము ప్రేమ సందికొను
నెగ్గుఁ దలంపక జారచోరచూ
డామణి యాద్విజుండు నెఱి
యున్కుఁదనంబున కెల్ల నెల్లయై. 131

శా. ఆవిప్రాధముఁ డక్షకేళినిరతుం
డై యాడి తా నోడియుం
దా విత్తంబున కెందునైనఁ జౌరధా
త్వర్థం బొగిం జేయుఁ గా
మావేశంబునఁ బుల్కసాంగనలతో
నైనం బ్రవర్తించు ని
శ్లీవేళం బురిఁ ద్రిమ్మరుం సుజను లెం
తేఁ ద న్విగర్హింపఁగన్. 132

తే. అందఱకు దినవారతారాదికములు
దెలిపి యుపవాసనియతి విధించుఁ గాని
యతఁడు మానఁడు కృష్ణజయంతియందు
హరిదినంబున శివరాత్రి నన్నభుక్తి. 133

తే. హరిదినంబుల వేయింట నైన సుకృత
మొనరు నొక్కకృష్ణాష్టమి నుపవసింప
వేయికృష్ణాష్టములఁ గల్గు శ్రేయ మబ్బు
నొక్కశివరాత్రి మానవుం డుపవసింప. 184

సీ. శివపదధ్యానంబు శివనామపఠనంబు
ననిశంబుఁ జేయుమహాత్ముఁ డొకఁడు
శతరుద్రమంత్రసంగతి శివు నభిషేక
మాచరించినయట్టి యనఘుఁ డొకఁడు
శ్రీఫలదళముల శివుని సహస్రనా
మంబులఁ బూజించుమాన్యుఁ డొకఁడు
లలితప్రదోషవేళల శివదర్శనం
బారూఢిఁ గావించు నార్యుఁ డొకఁడు

తే. నవనిలోన జీవన్ముక్తు లగుట ధ్రువము
నిమిషమైనను మఱి యర్ధనిమిషమైన
శివుని భజియించువానికిఁ జిరతరముగ
నిఖిలలోకాధిపత్యంబు నివ్వటిల్లు. 185

క. ఇల నొకయఖండబిల్వ
దళపూజను గోసహస్రదానఫల మగుం
దులసీదళార్చనంబునఁ
గలుగుం గ్రతుశతము సేయఁగా నగుఫలముల్. 186

తే. హరుని బంధురాఖండబిల్వక్షతలను
బూజఁజేయునదించు నెవ్వఁ డప్పురుషవర్యుఁ
డఘతతుల డిగ్గఁ ద్రావి పూతాత్ముఁ డగుచు
నలరి కైలాసపదమున నధివసించు. 137

క. అమితంబుగ నవిషాన్నము
నమలుటయున్ శోణితంబు నలిఁ ద్రావుటయుం
గ్రిమికీటభక్షణంబున్
సమ మగు శివరాత్రిఁ దినిన సరసాన్న మిలన్. 138

క. ధరఁ జంగాలాన్నముఁ గు
క్కురపలలముఁ దినుట మే లగు స్మృతి ప్రోక్తో
త్కరసంత్యాగము మే లగు
హరివాసరమున భుజించు నన్నముకంటెన్. 139

క. కనకస్తేయము గుర్వం
గనఁ గనయుట బ్రహ్మహత్య కాదంబరి క్రొ
వ్వునఁ గ్రోలుట యుర వగు ని
మ్మునఁ గృష్ణజయంతి నన్నము దినుటకంటెన్. 140

ఆ. అట్టివ్రతదినంబులందు భుజించి య
మ్మందరాహ్వయుం డమందహర్ష
పరవశాత్ముఁ డగుచుఁ దిరిగెఁ దేశములు ధ
నార్జనంబు సేయు నాస గొంటి. 141

వ. ఒక్కనాఁ డుజ్జయినీనగరంబునకుం జని యందు నల్ఛాహారుండై జఠరానలం *బినుమడింప నాసాయాంతంబును బురవీథులం గ్రుమ్మరి విసివి యద్దినంబు శివరాత్రి గావున నుత్సవదిదృక్షాసమాగతనాగరికజనసంఘంబులం జూచుచుఁ దోరణకాయమానవిరాజితంబును ఘనసార గంధసార కాశ్మీర మృగమ దాద్యనులేపితంబును సగరు గుగ్గుల ముఖ్య ధూపధూమ గంధ బంధురంబును దీపమాలికాసమాకీర్ణంబును జంపక కర్ణికార కరవీర మల్లికా మాలతీ బిల్వద ళాద్యనేకపుష్పజాలద్రవ్యసవ్యంబును భక్ష్య భోజ్య ప్రముఖ నైవేద్య పరిపూర్ణంబును నానావాద్యజనసమాకీర్ణంబును సఖండవిభవాభిశోభితంబు నైన మహాకాళదేవుదేవాలయంబునకుం జని యమ్మహాలింగమూర్తి సందర్శనంబు చేసి నమస్కరించి కొండొకదడవు నిల్చి యచ్చరితాత్ముం డిట్లని యూహించె.

తే. ఆఁకటికి నాకు నేమియు నబ్బదయ్యెఁ
బ్రాగ్భవంబునఁ జేయుపాపంబుకతన
సహావ సత్పాత్రునకును జన్మాంతరమున
నుపచరింపంగ లేనైతిఁ గపటవృత్తి. 143

క. జల భక్ష్య భోజ్య శాక
స్థల సూనృతభాషణముల సాధుజనుల కి

* ఋ మండింప—వా. ప్ర.

మ్మనలఁ దృష్టి సలుప నేన
క్కలుషంబున నిప్పు డిట్టిగతి వాటిల్లె. 144

సీ. ఈజన్మమున నైన గృహాసమాగతు లగు
నతిథులఁ బూజింప నైతి నకట
యనిశంబు దుర్వ్యసనాభిభూతుండ నై
స్నానసంధ్యాదులు సలుప నైతి
నన్యాంగనాసంగమాసక్తి మసలితి
హరివాసరాదిపుణ్యవ్రతముల
[illegible]కాలయమున క్షౌరమ్ము సలిపితి
నపుడ తైలాభ్యంజనాదికములు

తే. కరనిపీడితచేలంబు గట్టుకొందు
నిట్లు మఱియు దరిద్రతాహేయ. మగు కు
కర్మములు సేయుచుండితిఁ గాని సుకృత
కర్మ మొక్కటియును జేయఁ గాన నైతి. 145

ఆ. అన్నపూర్ణ యైన యవని నే నొకఁడన
యన్నకాంక్షి నగుచు నున్నవాఁడ
పాత్రములకు లేశమాత్ర మైనను దొలు
బాముసందు నిడనిపాపి నగుట. 146

వ. ఈజన్మంబునఁ దపోదానపూజాదు లొనరింపనికారణం
బున భవిష్యజ్జన్మంబునందును దరిద్రుండ నగుట తప్ప
దని తలంచుచు నాఁకటిచే ల్లాఁపలేక శివార్పితం బైన

యీభక్ష్యభోజ్యాదిపదార్థంబు లిజనంబు లేమఱియున్న
తఱి నపహరించి భక్షించెదం గాక యని యద్దుష్టమా
నసుం డాసమీపంబునఁ బొంచియుండె నంత. 147

తే. అనిశిథంబు శివపూజ యాచరించి
జాగరణకేలిఁ జేలి యచ్చటిజనంబు
లలసి నిద్రింప దీపంబు లస్తమించె
నవతమసు మల్లనల్లన యాక్రమించె. 148

సీ. అపుడు ద్విజాభాసుఁ డాశివాభ్యాశవ్రి
దేశంబునకు నోదనాశఁ జేరి
యమ్మహేశసమర్పితాన్నము దృష్టిని
భాగోచరంబైన నరయునేన్క.
ప్రబలి తత్రిత్యనిర్వాణదశఁ బొస్గు
దీపంబు నిజపటాదీప్తసర్తిఁ
బ్రజ్వలింపఁగఁ జేసి పక్వాన్నభక్ష్యభో
జ్యాదులు గైకొని యరిగె నంత

తే. వానిచరణాగ్రి మొక్కనిమేను బోకఁ
దస్కరుం డని కూయు నత్తఱి నెఱింగి
యాపెకులు చాల రువ్వి బిట్టార్చి చంపి
రవినయనిధాన మైన యయ్యవనిసురుని. 149

ఉ. అతఁడు గోటిశోటిజల
జాప్త విభావిభ వాంచితంబు లై

వాత్సకకోటికీలలము

వజ్రముఖాంతశూర్పశశ్యవి

స్ఫీతము నై చెలఁగు నొక

చిత్రవివరాంతరంబు సెదిస్కి సే

మాతనిం జొచ్చి తెద్చుటకు

నంచితి యింపుగఁ ద్వాప్రాదాలిచేఁ. 150

క. ఆహైమగగనయానా

రోహణ మొనరించి యప్సరోగణగాన

వ్యాహార్థిముఁ డై త్రిదశ

వ్యూహము వినుతింప నాతఁ డుజ్జ్వలమహిమన్. 151

వ. వేణువీణాగానముదితుం డై యత్తుణంబ కైలాసంబునఁ

కరుగుదెంచె నిట్లు. 152

తే. అతఁడు దీపప్రదానమహాత్మ్యకలనఁ

బతిముఁ డయ్యును నిర్వాణపథముఁ గాంచె

నియతమతు లైన సత్కర్మనిరతు లవని

దీప యిడునట్టిమహిమంబు దెలుపఁ దరమె. 153

వ. కావున. 154

తే. దీపదానంబుకంటె నుత్కృష్టపుణ్య

మొక్కటియు లేదు జగముల నెంచిచూడ

నిమిష మాహరిసన్నిధి నిలుపుదీప

మఖిలయుగలం బొసంగు నంయుటున రేఖ్య. 155

ఆ. ఒక్కమాస మైన నొకయబ్ద మైన న
ఖండదీప మిడునరుండు నిఖిల
దురితసమితి నొడిచి నిరతంబు శివలోక
మున వసించు దేవమునిలలామ. 156

సీ. గ్రహపీడ లడఁగు శాత్రవులు మిత్రతఁ గాంతు
రఖిలకామితసిద్ధి యగుఁ దలంప
నాయువు వర్ధిల్లు నట మనోవాక్కాయ
జము లైనకలుషసంఘములు దొలఁగు
జలగండములు దప్పు వెలయ రోగార్తుండు
దృఢశక్తియుక్తుఁడై తేజరిల్లు
వంధ్యఁ డెంతయుఁ బుత్త్రవంతుఁ డౌ దుర్గతుం
డనుపమసంపద నతిశయిల్లుఁ

తే. దీక్షఁ బూని యెంతయైన నుదారమహిమఁ
గోరి హరి యైన హరు డైనఁ గూర్చి యాజ్య
తైలములచేత నొక్కయబ్దం బఖండ
దివ్యదీపంబు నిల్పిన దృఢవివేక. 157

తే. అట్లు వర్షత్రయము దీప మవని నిల్పి
నతఁడె శంభుండు శౌరియు నతఁడె వర్ష
శతము భువి సర్వభోగసంగతిఁ జెలంగి
యంతమున మత్పథంబున నధివసించు. 158

వ. మఱియు దీపదానప్రకారం బెఱింగించెద. 159

తే. మాఘమైనను గార్తికమాసమైన
మొదలు గావించి సాయమువదను నిల్పి
పూజసేయంగవలయు సంపూర్ణభక్తి
ననుదినము నుంద్రకము నుపచార మొసఁగి. 160

వ. అవిఘ్నరాజసన్నిధి హరిహరులలో నొక్కని నుద్దేశించి
పురుషప్రమాణం బైనదీపదారువుపై మృత్తామ్రపిత్తళ
రజతసువర్ణపాత్రంబులలో నొక్కపాత్రంబున ఘృతంబును
నించి కార్పాసకృతవర్తి సఖండదీపం బిడునది యిట్లొక్క
వత్సరంబు గడచిన యనంతరంబ యథావిభవంబున
నొక్కసువర్ణప్రతిమ రచియించి యందు నిష్టదేవత
నావాహించి పూజించి. 161

తే. ప్రతిమయును దీపపాత్రంబు వటయుగంబు
ధర్మకర్మాభిరతునకు దాన మొసఁగి
యంత శక్తి కొలంది విప్రావళులకు
సరసమృష్టాన్న మిడి తృప్తి సలుపవలయు. 162

క. ఈసద్వ్రతంబు భక్తిం
జేసిన వాంఛితము లెల్ల సిద్ధించుం గై
లాసావాప్తియు నగు జల
జాసనసుత! మానవులకు ననవరతంబున్. 163

వ. మఱి యిక్కథాశ్రవణంబున నిఖిలదురితనివృత్తి యగు
నని చెప్పిన నప్పరమేశ్వరునితో లక్షపూజాప్రకారం

తే. శివునిపూజకుఁ గొన్నినల్ సిద్ధముచేళఁ
గరపదస్థలముల ముండ్లు గాడెనేని
హస్తపాదంబు లూర్ధ్వరేఖాంకితంబు
లగుట కది యాదికారణం బగు ధరిత్రి. 169

ఆ. ఇట్లు లక్షపూజ యింపొందఁ జేసిన
భూసురుండు రాజపుంగవుండు
హరిపదమున నైన హరనివాసంబున
నైన లక్షయేఁడు లధివసించు. 170

వ. అని శివుం డానతిచ్చునవసరంబున. 171

ఉ. వాసవముఖ్యనిర్జరు ల
వారితభక్తి శనిత్రిదామోదశీ
వాసరపుణ్యవేళఁ జెలు
వంబుగ నద్రిసుతాసహాయు దే
వాసురవంద్యమానచర
ణాంబురుహద్వయు నద్వయుఁ హరుఁ
వాసుకికంకణుఁ సుజన
వత్సలుఁ గొల్వఁగ వచ్చి రిమ్ములన్. 172

వ. ఇట్లు వచ్చి యక్కైలాసద్వారంబున. 173

క. శైలాదియనుమతంబున
నాలోనికి సమ్మదమున నరుదెంచి వెసఁ

శూలికి మ్రొక్కి తదాజ్ఞా
లీల సమాసీను లగుచు లేఖపతతుల్. 174

తే. హరుఁడు గట్టిన కలశ్రీ హారువు గాంచి
దీని నీటికిఁ దాల్చె నగ్రేశ్వరుఁ డనుచుఁ
దత్ప్రభాస్థితు శైవకథారసజ్ఞు
నతఘుతరు వామదేవుని నడుగుటయును. 175

క. కైలాసనగస్థితియును
ఫాలాక్షునిసన్నిధియును భవునికథలపై
హాళియు నివి యొక్కొకటియె
చాలవె యాదివిజవితతి జనిసఫలతకుఁ. 176

తే. దప్పి గొన్న జనం బమృతాంబుఁ గోలె
శివకథాసుధ నజరాళి చెవులఁ గ్రోల
నింపమర వామదేవమునీంద్రచంద్రుఁ
డిట్టు లని తెల్పఁదొడఁగె నహీనఫణితి. 177

చ. గజదనుజుండు నాఁ గలుగు
గాటపురక్కసుఁ డొక్కఁ డుర్వి న
ద్విజాల ముదం బడంచియును
దేవగణంబులదంబు మాన్చియుఁ
భుజబలశౌర్యసంపదలఁ
భాంపిరిపోవుచు నొక్కనాఁడు వా

రిజభవునొద్ద కేఁగి వెద
రించి కలంచెఁ దదీయలోకముల్. 178

వ. మఱియు. 179

శా. వైకుంఠంబున కేఁగి దానవుఁడు స
ర్వప్రాణిహింసార్థియై
ప్రాకారంబులు రత్నమందిరములుం
బ్రాసాదముల్ గూల్చి త
ల్లోకం బంతయు గాసిచేసెఁ దను నా
లోకింపఁగా నోప క
వైకుంఠాదు లకుంఠభీతి మెయి దు
ర్వారత్వరం బాఱఁగన్. 180

వ. వెండియు. 181

ఉ. ఆ సమదద్విపాసురుఁ డ
హంకృతి నెందును మాఱులేక కై
లాసముఁ జొచ్చి దిక్కరి గొ
లంకునుబోలెఁ గలంచియాడెఁ బా
నాసమయంబునం బ్రమథు
లందఱు నొక్కటఁ గూడి వానిపై
సేసిరి యుద్ధ ముగ్రమదు ల
హీనబలంబున నస్త్రశస్త్రముల్. 182

చ. ముసలగదాముసుంఠిశర
ముద్గరచక్రముఖాయుధౌఘముల్
వెసఁ బరగించి యద్దనుజ
వీరుఁ గలంపఁగ, లేక వానిఁ దా
రసదృశవిక్రమంబుఁ గొని
యాఁగిరి వాఁడు శ్రమంబుఁ జెంద క
య్యసమశరారికింకరుల
నందఱ నాజిఁ గలంచె నీసునన్. 183

చ. కమలభవాండభాండములు
గాల్చు నవక్రపరాక్రమాన్వితుల్
ప్రమథతతుల్ గజాసురుని
బారికిఁ గాక కలంగి బాఱి ర
య్యమరవిరోధియుం బవనుఁ
డంబుధులం గలఁగించులీల వి
క్రమము మెయిం బరాజితులు
గా నొనరించి యలంచె వారలన్. 184

మ. కరిదైత్యేశ్వరుఁ డుగ్రకింకరుల నా
గ్రిస్ఫూర్తిం గెల్చి యు
ద్ధరతం గ్రమ్మఱ పట్టణంబులు గిరి
ప్రాంతంబులం గొల్చుచుం

బొరి నేఁగ న్నిజపూర్వజన్మకృతప
త్పుణ్యప్రభావంబునన్
వరపాపాశికిఁ బుణ్యరాశికి దయా
వారాశికిం గాశికిన్. 185

క. ఆ కరటిదానవునిఘో
రాకృతిఁ గని వెఱచి పఱచి యున్నగరి ప్రజా
నీకంబు లుద్ధవిడిఁ జని
శ్రీకంఠున కధికభక్తిఁ జేమోడ్చి వెసన్. 186

వ. ఇట్లని విన్నవించిరి. 187

ఆ. దంతిరూపఘోరదానవుఁ డొకరుఁడు
నవనవాసప్రియోజనప్రమాణ
తనుఁడు వచ్చి వానిఁ గనుఁగొనునంతన
గుండె లగిలె జనులకును మహేశ. 188

సీ. సచరాచరం బైన జగ మంతయును వాని
చరణముగ్నం బయ్యెఁ జంద్రిమకుట
తపనీయగిరి వానిదంతాంచలంబునఁ
గందుకాకృతిఁ బొల్చె గరళకంఠ
భవవిష్ణుపద్మసంభవలోకములు వాని
బృంహితధ్వనిఁ బల్కెఁ ద్రిపురదమన
ధరణి యంతయు వానికరశీకరాసార
ధారాహతులఁ గుంజె ధరనివేశ

తే. యీదృశాకారదానవు నెన్నఁడైన
విన్నదియుఁ గన్నదియు లేదు విశ్వనాథ
వానిఁ బరిమార్ప నొరులకు వశము గాదు
దేవరకె కాని జగముల దీనరక్ష. 189

చ. వనజభవాండకోటు లని
వారణఫాలదృగగ్ని నేర్చి త
ద్ఘనభసితం బలందుకొను
కాంతతరాంగము గల్గు ప్రోవ నీ
వనయము కల్పవేళ నచ
రాచరమైనజగంబు నీదు కు
క్షిని దగఁ జొచ్చు నూరికిని
జేరదు బాహ్యజలంబు నోలినన్. 190

తే. నిఖిలము నడంగు నప్పుడు నీవు నొకఁడ
వద్వయుం డైనబ్రహ్మంబ వయ్యు నీశ్వ
రాఖ్యఁ జిచ్ఛక్తిరూపిణి యైనకాళిఁ
గలసి క్రీడింపు దానందకాననమున. 191

వ. దేవా ప్రసన్నుండవై యద్దనుజుం దుంచి జగంబులు
మనుపు మని ప్రార్థించిన నాకర్ణించి విశ్వేశ్వరుం డక్షా
శకిం గ్లేశావేశి యగు నప్పిశితాశిం బరిమార్పం దలంచి
యర్ధనారీశ్వరం బైనదేహంబు ధరియించి వెడలె నప్పు
డయ్యురుపురకు నత్యంతదారుణం బైనరణంబయ్యె నందు.

క. తుండాలదానవుఁడు నిజ
తుండం బెగయించి పట్టి ధూర్జటిపై రా
మొండుగ నద్దేవుఁడు శిత
కాండంబులు వఱపి వానిగతి మరలించెన్. 193

తే. ఆశరంబులు దైత్యకాయమున నాఁటి
లోమములరీతి నొప్పె నాలోన వాఁడు
తరులు గిరులును నేయ నత్తఱిఁ బురారి
శకలములఁ జేసె సాయకసముదయముల. 194

చ. శిలలు శిలోచ్చయంబులును
జేకొని యుద్ధనుఘుండు వెండియుం
జలమున వైవ శాతకులి
శపవిదరంబుల వాని నెల్ల న
గ్గలిక హరుండు ఖండములు
గా నొనరింపఁదొణంగె నిట్లు ని
శ్చలగతిఁ బోరి రిద్దఱును
సంగరరంగకళాపవీణులై. 195

తే. అర్ధనారీశదివ్యదేహంబు దనకు
మృత్యు వని యాత్మ నెంచి యాదైత్యుఁ డకుడు
ధీరతయు శూరతయు బలసారతయును
బ్రాపుగాఁ బోరె నావిశ్వభర్తతోడ. 196

క. ఉరుబలము౦ గౌశలముం
గరలాఘవ మశ్రితయుఁ గడురఁగఁ జోరన్
హరుఁడు గడు మెచ్చి వానిన్
వర మొసఁగెదఁ గోరు మని ప్రియంబుగఁ బలికెన్. 197
వ. పలికిన వాఁ డిట్లనియె. 198
క. ఈశా నీ స్మృతి యంటె యది
శ్రీకంఠుఁడ వైన నీదుచే నటె యిటి ప్ర
త్యేకమ రయిక్కొ-కటియె మా
త్పాకలనకుఁ గారణంబు లగుఁ బరమేశా. 199
తే. అనఘ సాయుజ్యమునకంటె నర్థనీయ
వస్తు వెద్దియు లేదు తద్వస్తు వప్ర
యత్నమునఁ గల్గె దాని నే నడుగ నింక
నొక్కవర మిమ్ము దేవ నీ వొసఁగెదేని. 200
మ. అజరస్తుత్యవిలాసభాసురనితాం
తాపారసౌందర్యముం
త్రిజగద్విశ్రుతమార్దవంబు నగరు
శ్రీఖండకర్పూరము
ఖ్యజగన్మాన్యమహానుగంధమును గ
ల్గంజేసి యింపొంద నా
యజినం బీవు ధరింపఁగావలయు క
మ్మాకాచ్ఛాదనపద్ధతిన్. 201

వ. అని కోరి రంత దేవగణంబులు దేవా యివ్వరం బొసంగి
లోకకంటకుం డగు నిద్దానవునిం బరిమార్చు మని పల్కిన
నట్లకాక యని యద్దేవుండు. 202

క. నిటకరశరధలాఘవ మ
గ్గ్యజరులు వినుతింప నొక్కరయాశుగమున న
గ్గజదనుజు నేయు వాఁ డ
క్కజముగఁ గుంభములు పగిలి కడువడిఁ బడియెన్. 203

లయగ్రాహి. భానుహిమభానుపవమానసఖలోచనుని
చే నిశితబాణహతి దానవుఁడు కూలం
బూని సురదుందుభు లనూనగతి మ్రోసె విరి
వాన గురిసెన్ విబుధమానినులనాట్య
శ్రీ నెరసెఁ జారణులు గాన మొనరించి రపు
డాని దిశ లన్నియు నభీనరుచిఁ బొల్చెన్
మానుగ సమస్తజనమానసము లుబ్బ నస
మానమృదుగంధశిశిరానిలము వీచెన్. 204

తే. అసురవరుకృత్తిఁ దాల్చి యాహరుఁడు కృత్తి
వాసుఁ డయ్యెఁ దత్కృత్తి యాఖ్యామదేవు
మాంసలాంసకయుగళిపై మహితమృదుత
రాంశుకాకృతి నలరారె నయుతులార. 205

చ. జలరుహసంభవాండచయ
జన్మలయస్థితిహేతుభూతుఁడై

యులరినయూనబాశివుడు
హార్త్వము దెల్పంగ నవ్వం డోలు న
ద్దళ చుఘు కాంబుపుష్పములం
దాలిమి నవ్విభుం బూజచేసినం
గలుగు నభీష్టసిద్ధి ఫల
కాంతు గొనర్చినవారి కెన్నంగన్. 206

వ. వెండియు నంకోలార్కద్రోణదుత్తూరప్రముఖకుసుమం
బులను గపిత్థబిల్వపత్త్రంబులను శివుం బూజించునతండు
సాయుజ్యంబుం జెందుం దక్కినపత్త్రంబులం బూజించిన
రాజసూయాశ్వమేధఫలంబు గాంచు. 207

ఆ. వస్త్రఫలజలాన్నభక్ష్యభోజ్యాదులు
శివున కర్పణంబు సేయవలయు
నిదియె సుకృతములకుం గుదు రిట్లు సేయని
యతనిజీవితము నిరర్థకంబు. 208

తే. హరున కతిభక్తి భక్ష్యభోజ్యాదికంబు
లర్పణముసేయక భుజించునధములకును
శ్వానసూకరముఖనీచజంతువులకు
నంతరము లేదు ధారుణి నరసి చూడ. 209

క. కనకమునకుం దొడవులకుం
ఘనసలిలంబునకు వీచికాతతికిం బలెన్

వనజాక్షవిరూపాక్షుల
కనిశము భేదంబు గలుగ దావంతైనన్. 210

క. వారల వేఱుగఁ జూచిన
వారలు సంసారఘోరవారిధిఁ బడి దు
ర్వారవ్యథఁ బొగులుదు ర
ప్పారము గానంగలేక బహుళాబ్దంబుల్. 211

తే. శివుఁడు సర్వంబు దేవుఁడు శివుఁ డొకండ
యవ్యయుం డద్వయుఁడు పరమాత్ముఁ డభవుఁ
డద్భుతతరుఁడు పరంధాముఁ డతనికంటె
నన్య మేమియు లేదు ధన్యాత్ములార. 212

తే. భూతిధారణ మొనరించుపురుషునకును
ధర రహస్యపరీక్షాకృతంబు లైన
పాపములు వాయు సంపద పరిఢవిల్లు
సర్వవిద్యలకును వాఁడె జన్మభూమి. 213

వ. విభూతిధారణరహితుండు పతితుం డగుఁ ద్రిపుండ్రాం
కితఫాలభాగుండును భూత్యుద్ధూళితతనుండును శివనామ
స్మరణపరుండును జీవన్ముక్తుం డగు మఱియును. 214

చ. శివుకథ వీనుల న్వినుచుఁ
జిత్తమునన్ శివునిం దలంచుచున్
శివభవనాంగణస్థలికిఁ
జేరుచు నాశివుఁ బూజసల్పుచున్

శివునకు నై ద్విజన్ములకుఁ
చెన్నుగ నన్న మొసంగుచుఁ శివ
స్తవపఠనాఢ్యుఁడై వెలుఁగి
తాన శివుం డగు మానవుం డిలన్. 215

తే. భూతిరుద్రాక్షధారణంబును శివాల
యాదినిర్మాణమును శివధ్యానమును త
*దర్చనంబుఁ దదీయనామానుకీర్త
నంబు నల్పతపంబుఫలంబు గాదు. 216

చ. అలరులు పత్త్రముల్ ఫలము
లంబులు శంభునివేదితంబులై
నలినదళాయతాక్షులను
సంచితసుందరనిష్కుటంబులన్
లలితసువర్ణరత్నశుభ
లక్షణలక్షితసౌధపంక్తులన్
గలుగఁగఁజేయు మర్త్యులకుఁ
గామితవస్తుపురస్సరంబుగన్. 217

సీ. రుద్రాక్షము శిరోభద్రాంబువులఁ బోఁగ
భాగీరథీస్నానఫలము గల్గు
సాయుజ్య మర్థిల్లు నతిఘోరపాతకముల్
చేరవు రుద్రాక్షధారణమునఁ

* దర్శనంబు—దర్శ్శనంబు—వ్రా. ప్ర.

వ. కార్తికసోమవారాదిపవిత్రశివపవిత్రవాసరంబులను పిత్రు దినంబులను పర్వంబులను విష్ణువ్రతదినంబులను మన్వాది వ్యతీపాతంబులను స్నానదానాదిక్రియ లాచరించి యుపవసించి బ్రాహ్మణులకు యథాశక్తి భోజనం బిడు మానవుండు క్రతుకోటిఫలంబువడయు మఱి దరిద్రుండు తన లేవడికిం జింతించుచు నాశుభదినంబుల స్నానతర్ప ణాదికర్మంబులు సలిపి తపోనియతాచారుండైన దాన ఫలంబు గాంచు నట్లుగాక ధనవంతుం డయ్యు సత్క్రియా కరణశీలుండై దానధర్మాదివిరహితుండైనయేని తరు గుల్మలతాదిస్థావరజన్మంబులు వడసి ఛేదచ్ఛేదనశీతాతప బాధాదిదుఃఖంబులం బొందుచు నిట్లని తలంచు. 222

మ. మనుజత్వంబున మున్ను గేహావనధనో
న్మాదంబునం గ్రొవ్వి నే
మనిశంబు న్బుధులం హసించియు ధనా
శాయాతదీనాళిం బె
ల్చన మోఘాశులం జేసి భోగసుఖలీ
లాలంపటత్వంబునన్
మని క్రూరాశయతన్ వసింపం దరుజ
న్మం బబ్బె మా కియ్యెడన్. 223

క. ప్రాక్తనతనువున శోభా
సక్తిమెయిన్ ధర్మవితతి సలుపక భోగా

ద్వ్యక్తిఁ దిరిమ్మరుట నుఖ
భుక్తి రహితమైన మాఁదిపుట్టువు గల్గెన్. 224

క. కుజనులము గాన యీగతిఁ
గుజనుల మైతి మిఁక నైనఁ గుసుమఫలదళ
వ్రజములు సుజనుల కిడి మ
ర్త్యజనిం బ్రాపింతు మనుచు నాత్మఁ దలంచున్. 225

వ. అని చెప్పి వామదేవుండు. 226

ఆ. పాత్రదానమున విపన్నుఁ డాపదఁ దరి
యించు నమ్మహాత్ము పొంచఁ దరము
తరువు లైనఁ దలఁచుఁ డ్వగ్గారు ఫల దళ
మూలవితతిఁ బాత్రములకు నొసఁగ. 227

వ. ఇత్తెఱంగునం దలంచి. 228

చ. అట ఫలసూనదానకల
నాభ్యుదయంబునఁ బాపముక్తి గా
విటపిలతాకృతుల్ దొలఁగి
వేమఱుఁ గుక్కుటకాకఘూకమ
ర్కటకిటిముఖ్యయోనులఁ ది
రంబుగ నుద్భవ మంది యందుఁ బ్రి
స్ఫుటసరదుఃఖముల్ గడచి
సాంపతి మర్త్యతఁ గాంతు రంతటన్. 229

మ. నిరతాచారులు నిర్మలాశయులు ని
ర్ణిదారిగమోక్తక్రియా
నిరతుల్ దైవతదూషణోక్తి విముఖుల్
నిర్మాయులున్ శంభున
త్కరుణాపాత్రులు జీవదూషకులు శ్రౌ
తస్మార్తముఖ్యక్రియా
త్కరదూరుల్ ఖలులున్ మహేశుకృపకుం
గా రెంతయుం బాత్రముల్. 233

చ. అనఘనగీర్షఁ బొల్చునన
కాదులు వేదవిశారదుల్ తపో
ధనులు గనంగలేని శివ
తత్త్వము, రాగహతాత్ములై ఫలం
బనయము గోరి కొల్చి ఫల
మందక తక్కన, నిష్టదేవతన్
ఘనముగ నిందసేయు నల
కట్టిఁడిమర్త్యులు గానసేర్తురే. 234

మ. హరమాయాంబునిధిం మునింగి ధనకాం
తావర్గ గర్వంబులన్
వరుసన్ లోఁబడి యుంత సంతరరిపు
ద్వర్గోగ్రనక్రవ్యథా

తురతం గుందుచు విష్ణుభక్తి నళవుగా
దూషించుచున్ స్వాంతి యా
హరభక్తిన్ హరి నిందసేయుడు రసూ
యాగ్రిస్థులై మానవుల్. 285

తే. భూసురుల దేవతలను దపోధనులను
నిందనం బొనరించిన నీచతముఁడు
శంభుమాయామహాత్మ్యుఁడై స్వకృతసుకృత
మహిమఁ గోల్పడుఁ దా నొకమాటమాత్ర. 286

తే. వసుధఁ గార్తికమున నిందువాసరమున
శివుఁ దిలాక్షతములఁ దులసీదళములు
బిల్వదళములఁ బూజించి ప్రీణనంబు
సలుపఁ గలుగు నగ్నిష్టోమసవనఫలము. 287

క. తిలదానదీపదానం
బులు నుపవాసంబు హార్థనిపూజయును వ్రతం
బులు కార్తికమాసంబున
నలరారఁగ నొక్కటొక్కటి యధ్వరసమములుల్. 288

ఉత్సా. కార్తికమునఁ గల్యవేళ గాలువఁ మునింగి ని
ర్వర్తితస్వకర్ముఁడైనవాఁడు త్రిదివవాసియై
కీర్తిఁ బెక్కుదివసములు సుఖించి యంత మరలి భూ
భర్త యగుచు నుద్భవించు భవ్యభూతికలితుఁడై. 289

ఆ. కార్తికంబునందు గౌతమీస్నానంబు
శశిదినోపవాససద్వ్రతంబు
నందుఁ బురహరార్పితాన్నదానంబును
దురితచరితులకును దుర్లభములు. 240

ఉ. పావనలీలఁ బొల్చు నల
బాహుళమాసమురాకఁ గాంచి గో
దావరివారిఁ గ్రుంకుచు సు
ధాకరవాసరసువ్రతంబు న
ట్లోవనఁ జేయ భావభవ
భంజనుసన్నిధి యబ్బు నరచు దే
వావళి యుర్విఁ బుట్టుటకు
నాసపడుం దగ నెల్లవేళలన్. 241

మ. అతిభక్తి నూర్జమాసమున
నన్న మొసంగిన నాకలోకముం
జతురపటం బొసంగిన ని
శాకరలోకము దీప్తకాంచనాం
చితమణిభూషణం బొసఁగి
చెన్నుగ నచ్చర లుండులోకమున్
వితరణశాలి గాంచుఁ బ్రథి
వీచరఖేచరపూజ్యమానుఁడై. 242

తే. వారు గోదావరీతటావాసు లయ్యుఁ
గార్తికంబునఁ గ్రుంకని ఖలజనముల
తనువులు నిరర్థకంబులై తనరుఁ జర్మ
దారుకృతయంత్రపుత్త్రికాతతులమాడ్కి. 243

క. గోదావరిమజ్జనమును
శ్రీదయితత్రిపురహరులసేవయు సత్సం
గాదరణంబును దానద
యాదులసంగ్రహము నరుల కఘనాశనముల్. 244

తే. ధనికుఁడై యుండి పుణ్యతీర్థంబులందుఁ
బుణ్యకాలంబులందును బుణ్యకార
ణందుఁ బాత్రములకు లేశ మీని నిడని
వాల్యుఁడు దరిద్రుఁ డగు జన్మజన్మములను. 245

తే. శైశవంబునఁ జారుణ్యసమయమునను
స్థావిరంబున ధనము పాత్రముల కొసఁగు
నతఁడు రెండవజనిఁ దత్తదవసరముల
నాఢ్యుఁడై భోగభుక్తిచే నతిశయిల్లు. 246

క. యాచకుఁ డడుగుచు నుండఁగ
వాచాఘాతంబు ప్రియము పల్కఁడయే న
న్నీచుఁడు మూకయుఁ జెవిటియు
నై చెడుఁ దా నంతవృత్తుఁడై జనియించున్. 247

శా. వైవర్ణ్యస్వరహైన్యకార్శ్యనిరతా
వాసంబుఁ దృష్ణాశనా
యావల్లీనికురుంబకోహదము దై
న్యార్తిసకంపత్రపా
దావాగ్నిన్యదమాతరిశ్వ మురుసం
తాపాదిసృష్టిక్రియా
దేవజ్యేష్ఠము యాచకత్వ మది సి
ద్ధించున్ లఘుత్వం బిలన్. 248

సీ. బ్రతికియుండిన మఱి మృతప్రాయుఁ డగుచు
స్థూలతనుఁ డయ్యుఁ దృణగతిఁ జుల్క నగుచు
సకలజనుల కుపేక్షానిశాంతుఁ డగుచు
యాచకుఁడు సంచరించు ధనార్థి యగుచు. 249

ఉ. వాని సమర్థదృష్టిఁ గని
ద్వారనిరోధన మాచరించి దు
ర్మానమునన్ హసించుచుఁ ది
రస్కరణం బొనరించి మత్తుఁడై
కానియు నియ్యలేనియల
కట్టిఁడిమర్త్యుఁడు వేయిజన్మముల్
దాను దరిద్రుఁడై మెలఁగి
స్థావరజన్మముఁ దాల్చుఁ బిమ్మటన్. 250

క. దీనత నడుగఁ జేరిన
మానితధరణీసురులకు మన్నింపని పృ
థ్వీనాథునిరాజ్యంబునఁ
బూను ననావృష్టి దుఃఖములు పెల్లొదవుఁగా. 251

క. శివునకుఁ బ్రియముగ దానము
శివపూజ పరోపకృతియుఁ జేయని క్రూమా
నవుఁ డతనితనువుకంటెను
భువి మేలగుచుండుఁ దోలుబొమ్మలమునుల్. 252

తే. శివుఁడె తల్లియుఁ దండ్రియు శివుఁడె సఖుఁడు
శివుఁడె బంధుండు ధ్యేయుండు శివుఁడె సేవ్యుఁ
డఖిలము శివాత్మకంబు దదన్య మొకటి
గలుగ నేరదు సకలలోకములయందు. 253

ఉ. స్థావరజంగమప్రతతి
సర్వ మఖర్వశివాత్మకంబుగా
భావమునం దలంచుచును
భక్తి మెయిన్ శివపూజసేయు న
ప్పావనుఁడే శివుండు శివ
భవ్యతరస్మరణాఢ్యుఁడైన య
క్కేవలభక్తవర్యునకుఁ
గీటువిభుండు కృతాంతుఁ డుర్వరన్. 254

చ. శివుఁ డన నేన కా యనుచుఁ
జిత్తమునన్ శివపూజ సేయుచున్
శివశివ యంచుఁ బల్కుచును
శ్రీశివసత్కథ లాలకించుచున్
శివమయ మిజ్జగం బనుచుఁ
జెన్నుగ నెంచుచుఁ బ్రొద్దుపుత్తు నా
శివుఁ డిఁక నన్ను నెన్నఁటికిఁ
జేర్చిన నొచ్చెముగాదు మే లగున్. 255

తే. అనుచు నేవేళఁ బలికెడు నతఁడె శివుఁడు
సర్వమంగళసంగతు శైలకన్య
శాసహితు గాంగఝరధరుఁ గల్యవేళఁ
జింతసేయంగఁ దగుఁ బాపశాంతిఁ గోరి. 256

పృథ్వి. శివస్తవచయంబులున్ శివసహస్రనామంబులున్
శివాంతికతలంబునం జెలఁగి పల్కు రుద్రాక్షముల్
నవాచ్ఛభసితంబు సంతతముఁ దాల్చు సన్మర్త్యుఁడున్
భవవ్యయవిదూరుఁడై భవతఁ జెందు నిక్కంబుగన్. 257

సీ. శివనామపఠనంబు సేయక యఱచిన
రసనికల్ మండూకరసనికాళి
శివమందిరములకుఁ జేరక నడచిన
యంఘ్రులు దారుమయాంఘ్రిచయము

శివలింగసంపీఠ సేయక పీఠించు
చక్షులు మాయూరచంద్రకములు
శివసమార్చితబిల్వసిద్ధవాసన లేని
ఘ్రాణయుగ్మము భస్త్రికాయుగంబు
తే. శివునిసత్కథ లనిశంబుఁ దెలిసి వినని
కర్ణగోళము ఘటగతాకాశతలము
శివునిఁ బూజింపఁ గానని చెనఁటికరము
దారునిర్మితనిస్సారదర్వి యుర్వి. 258

క. శివకథ వినుటయె తొడవగుఁ
జెవులకు, దానంబె తొడవు చేతమ్ములకున్
మివ్రుల భరం బగుచుండున్
భువిఁ గుండలకంకణాదిభూషణచయముల్. 259

తే. దేవదేవుని శివు మహాదేవు మాని
యితరదేవాళిఁ గొల్వఁగ మతిఁ దలంచు
నతఁడు భాగీరథీతటం బాసఁ జేరి
శైవలముఁ ద్రవ్వంగఁ బూనినచెనఁటి గాఁడె. 260

ఆ. శివుఁడు మానసాబ్జసీమ వసింపంగఁ
దవులుకలుషసమితి దవులఁ బఱచుఁ
బూర్వశిఖరిమీఁదఁ బొలుపొందురవిఁ గని
సంతమసము వేగ జాఱునట్లు. 261

క. స్మరఘనస్మరశుభనామ
స్మరణము తద్ధ్యానరతియు మఱి తత్పూజా
దరణము సంసారార్ణవ
తరణులు కలుషాంధతమసతరణులు ధరణిన్. 262

చ. పవలును రేయుఁ జేయు తత
పాతకజాత మడంగఁ జేయుఁ దా
శివ యనుమాట యొక్కపరి
జిహ్వఁ బొనంగు మనుష్యకోటి కి
య్యనిని ననేకకోటిదురి
తాళి నడంచు తదీయశక్తి కిం
జవమతిఁ దూఁగుపాతకము
సల్పఁగలండె దురంతపాపియున్. 263

చ. ఒకపరి శంభునామము న
రోన్నతి నాలుకఁ జెందెనేనియుం
బ్రకటితజన్మకోటులకుఁ
బ్రాచితమై విలసిల్లు ఘోరపా
తకయుతుఁడైన శంకరప
దస్మరణంబున ముక్తిఁ జెందు జి
హ్వకు ఫల మెల్లకాలము శి
వస్మరణంబె మనుష్యకోటికిన్. 264

తే. జన్మశతకోటికృతపాపశైలములకు
హరునినామంబు శతకోటి యట్టినాను
కీర్తనంబును దాని ధ్యానవర్తనంబుఁ
దలఁపఁగన్యయు సంసారతారకములు. 265

క. ఈయాఖ్యానము వినిన న
పాయంబులు వాయు సుకృత మబ్బు ధరిత్రిన్
ఆయువు పెరుగుం బిదప శి
వాయతననివాససిద్ధి యగు మనుజులకున్. 266

వ. అని చెప్పి నారదుం డిట్లనియె నవ్వామదేవువలన స్వర్గా
పవర్గకారణం బైన యీశ్వరమహిమంబు విని కృతా
ర్థులై యమ్మునిబృందారకబృందంబులు సంత. 267

చ. దశభుజుఁ బంచవక్త్రుఁ గర
తామరసాత్తపరశ్వథాయుధున్
శశిధరు ఫాలలోచనుఁ బ్ర
సన్నముఖాంబుజు మౌనివందితుం
బ్రశమితదోషు నీలగళుఁ
బర్వతరాట్తనయామనోహరున్
విశదశరీరు శంకరుఁ బ
వితిచరిత్రునిఁ గాంచి మ్రొక్కుచున్. 268

వ. ప్రాంజలులై యిట్లని విన్నవించిరి. 269

చ. భవ భవదీయసన్మహిమ
పన్నుగ వింటిమి వామదేవుచే
దవిలి భవద్భవిష్య దవ
తారకథల్ విన వేడు కయ్యె మా
కవి దయఁ జెల్వఁగా వలయు
నవ్యయభవ్యవచోవిలాసత౯
శివమతి యా మృకండసుతు
చే మును వింటిమి గొన్ని దత్కథల్. 270

వ. అని యడిగిన నద్దేవగణంబులతో నద్దేవదేవుం డాత్మభవి
ష్యదవతారకథావృత్తాంతం బిట్లని చెప్పం దొడంగె. 271

ఉ. రావణనామధేయుఁ డొక
రక్కసుఁ డుక్కునఁ ద్రేతయందు నా
ళీ వనజాతసంభవుని
చే వరలాభముఁ గాంచి మానుల౯
దేవతల న్బలారిముఖ
దిక్పతులం గడు బాధసల్పు దు
ర్భావతఁ గుంభకర్ణుఁ డను
పాపుఁడు వానికిఁ దమ్ముఁడై తగన్. 272

ఉ. ఆదివిజాభియాతికి మ
హాగుణశాలి విభీషణుండు నా

సోదరుఁ డొప్పు వెండియును
సోదరి శూర్పణఖాభిధాన యు
ర్మేదినిఁ గల్గుమాయలకు
మేటి యనం బొలుపొందుచుండు మం
దోదరి నాఁగఁ జెల్వగుకృ
శోదరి రావణుపత్ని యై తగున్. 273

ఉ. ఆమహిళాలలామకుఁ బ్రి
యాత్మజుఁ డొక్కఁడు గల్గు నింద్రజి
న్నాముఁడు వెండియుం దనుజ
నాథున కయ్యతికాయముఖ్యు లు
ద్దామబలుల్ జనింపు సుగు
దారుణగాత్రులు పుత్త్రపౌత్త్రి
ట్లామున వృద్ధిఁ బొందె యుతఁ
డంత వసించును లంక యన్పురిన్. 274

చ. అదియుఁ ద్రికూటశైలశిఖ
రాగ్రమునం దగి హేమవిస్ఫుర
త్సదనముల న్వినూత్నమణి
జాలవినిర్మితసౌధవీథులం
గదియు గభీరనీరపరి
ఘావృతసాలములం దనర్చు నం

నవలకు నాస్పదంబును శు
భప్రకరంబులకొనకంబు నై. 275

సీ. అందుండి బలగర్వ మడర దశాస్యుండు
ఫలభుగ్గణంబులు బలసి కొలువ
యక్షకింపురుషాహిరాక్షసగంధర్వ
వరుల నిర్జరులఁ గిన్నరుల నరుల
నాహవంబుల గెల్చి యందఱసంపదల్
గైకొని యీగతి గాసి సేయఁ
ద్రిదశులు భీతిల్లి త్రిదివంబు దొఱఁగి మా
యావేషధరు లయి యవని కరిగి

తే. నవలు శాఖామృగాదిరూపములు దాల్చి
యువలఁ బైశాచవేషముల్ సవదరించి
యార్తిబడిఁ దద్వధోపాయ మాత్మఁ దలఁచి
శరణము భజింపుదురు మము సమ్మదమున. 276

ఉ. శ్రీమతిఁ బుష్కలస్తుతులు
చేసి దశాస్యకృతంబు లైన బల్
బాములు దెల్పినఁ విని కృ
ప న్సురసంఘముఁ గాంచి యేను శ్రీ
రాముఁడ నై జనించి యల
రక్కసుఁ ద్రుంచెద నేన కాక య

ప్పామరు గల్వ నొంటవోకఁడు
పాల్పడనోపున ముజ్జగంబులన్. 277

ఆ. వాఁడు బ్రహ్మదత్తవరగర్వమునఁ గ్రొవ్వి
వాఁడు గాన జగమువాఁడి ద్రుంచు
ధరణి దశరథునకుఁ దనయుఁడై రాముఁ
డనఁగ దనరి వాసియద టచంతు. 278

క. హరి లక్ష్మణుఁడై మతోస్సె
దరతన్ జనియించి సన్నుఁ దగ సేవించున్
హరియించు నింద్రజిత్తున్
హరి దక్కుఁగ వాని నోరుల కలవియె త్రుంపన్. 279

ఉ. అవనితనూజ సీత గిరి
జాంశమునం బ్రభవించు రాఘవుం
డవని మదంశసంజనితుఁ
డై తగి దైత్యుల నెల్లఁ ద్రుంచు రా
ఘవుఁడె భవుండు విష్ణుఁడును
గంజభవుండును సర్వదేవతా
ప్రవరులు సీతయే యుమయుఁ
బద్మయు వాణియు దేవకాంతలున్. 280

వ. అని దేవగణంబుల సమ్మతిల్లంజేసి యనుపుడు ముని చెప్పి
యీశ్వరుం డిట్లనియె. 281

ఆ. భువనమాత సీత భువిఁ గల్గు స్త్రీరూప
ములు ధరించి లోకముల వసించుఁ
బురుషాకృతులను బొలుపొంది రాముఁ డ
జాండభాండములను నిండియుండు. 282

తే. రాముఁడె నిరంజనుఁడు పరబ్రహ్మ మభవుఁ
డాదికారణ మగు జగదావళికిని
సర్వగుఁడు సర్వసాక్షియు సర్వదేవ
వందితుండును కేవలానందమయుఁడు. 283

క. సనకప్రభృతులు విబుధులు
ఘనులు వసిష్ఠాదిమునులు గననేరరు రా
మునితత్త్వ మల్పమతు లగు
మనుజులు గన నెంతవారు మర్త్యములోనన్. 284

చ. అనిలజసేవితాంఘ్రిఁ గన
కాంబరుఁ గోటిమనోజసన్నిభున్
ఘనఘననీలవిగ్రహునిఁ
గౌస్తుభశోభితవక్షుఁ బద్మలో
చను నవనీసుతాయుతుఁ బ్ర
సన్నముఖాంబుజు రాము నెప్పుడున్
వినుతి యొనర్చువారలకు
వెండియుఁ బుట్టువు గల్గనేర్చునే. 285

సీ. ఋష్యశృంగమహర్షికృతసుతకామేష్టి
మహిమచే దశరథమహీభుజునకుఁ
బ్రభవించి రాముఁడు పరమపావననాముఁ
డనుజసమేతుఁడై యరిగి బాహు
కీలితశాతాసిఖేటకం బాటకఁ
బరిమార్చి ద్రోహు సుబాహు మునిమ
కౌశికునవనంబు గావి గంగానది
తరణం బొనర్చి గౌతమునిపత్ని

తే. శక్రమోహితయై పతిశాపవశత
దశసహస్రాబ్దములు శిలత్వము భజించి
శ్యామజీమూతసంఛన్నచంద్రరేఖ
యందమున నున్నదానిఁ బూతాత్మఁ జేయు. ౨౮౬

చ. జనకునిపట్టణంబునకు
జానుగ నేఁగి రఘూద్వహుండు తా
ననువుగఁ గాకపక్షధరుఁ
డయ్యె నృపాలురు మెచ్చ మచ్చరా
సనదళనంబుఁ జేసి యల
జానకిఁ బెండిలియై యయోధ్యకుం
జనువడ నేఁగు మార్గమున
భార్గవరాముని గెల్చు నుక్కునన్. 287

క. సీతాయుతుఁడై యట సా
కేతనగరిఁ జేరి సుజనకీర్తితకీర్తి
స్ఫీతగతిఁ గొన్నియబ్దము
లాతతసుఖకేళిఁ జేలు నతఁ డందుఁ దగన్. 288

వ. అంత. 289

ఉ. రాముఁ గుణాభిరాము యువ
రాజధురంధరుఁ గా నొనర్పఁగాఁ
బూ మది నెంచి పౌరజన
తం గని పఙ్క్తిరథుండు పల్కు నీ
రాముఁడు సర్వసమ్మతుఁడు
శ్రీత్రిహితుండును ధార్మికుండు నే
నీమహిభార మీయనప
యిఁక ఘటియించి నంభింపఁ గోరెదన్. 290

చ. జనకునిపోలికం బ్రజ న
జస్రముఁ బ్రోచు సుధాంశుకైవడిన్
జనులకు నెల్లకాలమును
జల్లఁదనం బొనగూర్చు రాముఁ డీ
నసయుఁడు మీకు రా జగుట
సమ్మతమే యన వార లుబ్బి యో
యినకుల మామనోరథము
నిట్టిదె పట్టము గట్టు మీఘనున్. 291

క. అని పల్కు పౌరజనముల
యనుమతిఁ గొని రామదేవు నభిషేకింపన్
మనమున నుత్సుకుఁడై య
జ్జనపతి సంభారసమితి సమకూర్చెఁ దగన్. 292

ఉ. ఆనృపుభార్య కైక యను
నంగన యయ్యభిషేకసంభ్రమం
బానతిఁ గాంచి మున్ను వర
మాన్నృపుఁ డిచ్చుటఁజేసి కోరు స
మ్మానిని యాత్మపుత్త్రు గరి
మంబునఁ బట్టముగట్ట రామునిం
బూని చతుర్దశాబ్దములు
భూరివనాంతరవాసిఁ జేయఁగన్. 293

తే. అతఁడు వరపాశకీలితుం డగుటఁజేసి
భార్య వేఁడిన నేమియుఁ బలుకకుండు
నట్లు కాదె దృఢవ్రతు లగుమహాత్ము
లాడఁబడినమాట వోఁ ద్రోవ నోర్వఁగలరె. 294

ఉ. ఆయెడ దేవతాగణము
లయ్యభిషేకశుభాంతరాయముం
జేయఁగ నాశ్రయించి నతి
సేయఁగఁ గైకయు వారిబోధచేఁ

బాయక యవ్వరద్వయము
భర్తను వేఁడఁగ దైవవంచితుం
డై యొసఁగిచ్చు సత్యరతి
నాత్మకులాంగనవాంఛితార్థముల్. 295

సీ. సురలు విరులవాన గురియింతు రప్పుణ్య
రాశియైన పక్షిరథుని మీఁద
నలని సత్యమునకు నలరుచు నాత్మీయ
కార్యసఫలతకును గరముఁ బొంగి. 296

తే. వెలఁగి రాముఁడు పట్టాభిషేకవేళఁ
గైక యొసఁగినపరుషవల్కలముఁ దాల్చి
యువిగతానందమయుఁడు దా నగుటఁ దెల్పు
భోగయోగసమత్వవిస్ఫురణ దనర. 297

క. ఆ రాముని ముఖవిలసన
మారసి యాతండు శిష్టుఁడ యగు నిక్కము చె
ల్వార మనుజుండు గాఁ డని
యారూఢి న్నిశ్చయింతు రావీటిప్రజల్. 298

ఉ. ఆతఁడె దండ్రియానతిఁ బ్రి
యావరజుండు సుమిత్రపట్టియున్
సీతయుఁ దోడ రాఁగ నత
సీసుమహాటవిఁ దా రాముఁ డేఁగి గం

గానటీసీతటంబున సు
ఖస్థితి నిల్చి గుహాభిధానవి
ఖ్యాతుని శృంగిబేరనగ
రాధిపుఁ గాంచుఁ గిరాతవల్లభున్. 799

తే. ముందుఁ దా నెక్కి వచ్చిన స్యందనము సు
మంత్రుఁ డనుయాతవరునిచే మరల ననిచి
యమునానది దాఁటి యగ్గుహానుమతమునఁ
జని యతండు భరద్వాజమునికి మ్రొక్కె. 800

ఉ. ఆఋషిరయాన పూని చని
యారఘువీరుఁడు గాంచు భూరిమం
దారనమేరువీరతరు
దాడిమముఖ్యమహీజవాటముల్
సారసుధారసాచ్ఛరుచి
సాంద్రఝరాంచితసత్ప్రకీటముల్
శ్రీరమణీయదేవగణ
సేవితకూటముఁ జిత్రకూటముల్. 801

తే. అవనిజాలక్ష్మణసమేతుఁ డగుచు రాముఁ
డాధరాధరవరమున నధివసింప
నాథునినిఁ బాసి దుఃఖాకులాత్ముఁ డగుచు
స్వర్గమున కేఁగు దశరథక్ష్మావరుండు. 803

మ. ఫణినీనాథుఁడు స్వర్గతుం డగుడు నం
తం గైకయీనందనుం
భరతు స్మంత్రులు రాజ్య మేలు మనుచుం
బ్రార్థింప నాసత్యవా
క్పరతుం డొల్లక తల్లి నుల్లమునఁ దా
నిందించి శ్రీరాముఁ దే
నరుగుం బౌరపురోహితార్యజనభృ
త్యామాత్యవర్గంబుతోఁ. 303

క. ఈ రీతిఁ గుహుఁ గని యతఁడు గి
రాలిపతిం గాంచి యట భరద్వాజునిచే
నాతిథ్యము గొని రాముని
శైలపతివసతి యున్ముస్మరించుఁడు తెలుపన్. 304

చ. భరతవిభుండు గాంచు మద
బంభరడింభకగీతనాదమే
దురతరపాటలీవకుళ
తుంగలవంగసుగంధభారభా
స్వరమదవంతుకస్థగిత
సానుచరత్సురయుగ్మరభూటముం
స్థిరగడపాళ్మకోణను క
చిత్రికభాటముఁ జిత్రకూటమున్. 305

సీ. అన్యసింహభ్రమదాత్మబింబాంచిత
స్ఫురదారటత్సింహశాబకంబు
హీరరత్నద్యుతిపూరమిథ్యాజలా
మిళితపానాదిభృంగగణంబు
కంజరాగప్రభాపుంజమృషారక్త
పానలోలద్వీపిపరివృతంబు
గతపర్ణలవలికాతతలతాళికాహి
ఖాదనవ్యగ్రశిఖావళంబు

తే. నిబిడతాపింఛవనకూటనీలనీర
వాహవార్బిందులోభానవరతవిసృత
చంచుసంచయచాతకసముదయంబు
కూటచయబంధురము చిత్రకూటధరము. 806

ఉ. సింధురదానవర్షగవి
చిత్రమహీజవిహారిభిల్లపు
ష్పంధయశిక్షకాళిముఖ
పంకజసౌరభా మూనఁ గోరి ప్ర
ష్పంధసంచయంబులు సె
నం జనుదెంచి తదీయనాసికా
గంధఫలీవిలాసములు
గాంచి కలంగి త్రోలంగ నగ్గిరిన్. 807

శా. శ్రీరంగుస్సీల ఘనాఘనాభు నరవిం
దాక్షు న్మహాబాహునిం
గందర్పాయుతసుందరు న్వసుమతీ
కన్యాయుతు న్మౌని మా
కందారామవసంతు రాఘవుని శో
ధ్యం గాంచి కేల్మోడ్చి చె
ల్వొందన్ భూపరిపాలనంబున కలిం
దొప్పారఁ బ్రార్థింపఁగన్. 308

తే. అమ్మహాత్ముఁ డాప్రార్థన నమ్మఁజేసి
మరలఁ బనిచిన భరతుఁ డమాత్యమాత్య
హితపురోహితసహితుఁడై యేఁగుదెంచి
పురము చేరక నందిగ్రామమున వసించు. 309

తే. భరతుఁ డరిగిన రాముఁ డగ్గిరిఁ దొలంగి
దండకాటవి కేఁగు నీదండ నున్న
మరలఁ గారులు వచ్చిన మద్వ్రతమున
కంతరాయంబు సంధిల్లు నని తలంచి. 310

వ. ఇట్లు దండకారణ్యంబుఁ బ్రవేశించి యందు. 311

భుజంగప్రయాతము. దినేశాన్వయుం డుగ్రతేజోంచిత ప్రదీపుం
ఘనోచ్చండ[illegible]దండంబు చేతన్
గనత్సంతతక్రోధుఁ గ్రవ్యాది[illegible]
న్వనిర్ఘోషనిర్ధూతసాధు[illegible]. 312

తే. సనఘుతరశుచిభాస్వదబ్జాంబకుండు
సచలభాముండు ద్వీపిరాడజినచేలి
భవుఁడు దా నైన కుంభసంభవునిఁ జేరి
యారఘుస్వామి వందనం బాచరించు. 316

క. మన్మార్త్యంతర మగుఘట
జన్ముని వింధ్యాద్రిదమను సన్మునివరు ను
ద్యన్మతి భజియించుచు నా
చిన్మయుఁడు వసించు నతనిచే దీక్షితుఁడై. 317

క. అమ్ముని యక్షయతూణీ
రమ్ములు నైంద్రి మగుచాపరత్నము దివ్యా
స్త్రమ్ములు నిస్త్రింశంబును
సమ్మోదితహృదయుఁడై యొసంగును బడసెన్. 318

వనమయూరము. జానుగ నిసర్గబలశౌర్యయుతుఁ డయ్యెన్
మానివరదత్తశరమండలి కడంకన్
బూని యురుతేజమున భూపమణి యంతన్
పూన నౌరవట్టు మణిచందమునఁ బొల్చెన్. 319

తే. అచట నతఁడు వసింపంగ నఖిలమునులు
నసురకృతబాధల నలంగి యరుగుదెంచి
రామ మమ్ముఁ గావు మనుచుఁ బ్రార్థన మొనర్చి
విన్నవింపుచు రిట్లు ప్రసన్నఫణితి. 320

ఉ. రక్కసు లాత్రిమంబులకు
రాయిడిసేయఁగ కేవగల్లు మే
మక్కట చిక్కి నిష్ఠురయు
సన్నముగాన కనూనభీతి నీ
చక్కటి కేఁగుదెంచితిమి
స్నానము సంధ్యయు వేదపాఠముం
దక్కటికర్మకాండమును
దాలిమిఁ జేయఁగ లేకపోదుర్. 831

వ. స్నానసంధ్యాదిసత్క్రియాకలాపంబు లకాలకృతంబులై
యరిష్టం బాపాదించుం గావున నారక్కసుల నుక్క
డంచి మమ్ముఁ బ్రోవు మని ప్రార్థించిన నారఘువీరుండు
దేవారులం ద్రుంచుటకుం బ్రతిజ్ఞచేసి వారలు సనిన
యచ్చట నుండునంత. 822

క. శూర్పణఖ యనెడిదానవి
దర్పకదర్పార్తయగుచుఁ దనుఁ జేరఁగఁ జెం
పేర్పడఁగ ముక్కు దునుముగ
స్వర్పతివినతుఁ డగు రామచంద్రుఁడు గడిమిన్. 828

చ. అదియును నేఁగి తెల్ప ఖరుఁ
డాదిగఁ బెక్కురు యుద్ధదుర్మదుల్
త్రిదశవిరోధు లాజి నెదు
రించిన నప్పదునాల్గువేలురం

గదనములోనఁ ద్రుంచు లయ
కాలఘనాఘనశంబడంబర
ప్రదరచయప్రయోగమున
రాముఁడు భీమగతిం జెలంగుచున్. 324

ఉ. వారలు మున్ను భూసురు ల
వారితభక్తి ననుంగుఱించి దు
ర్వారతపం బొనర్చి కడు
వక్రతరోక్తుల ముక్తిఁ గోరుటన్
శ్రీ రమరారిజన్మములు
జొచ్చిరి నే రఘురామునాకృతిన్
ధారుణిఁ బుట్టి వారి నుచి
తస్థితి ముక్తులుగా నొనర్చెదన్. 325

వ. ఇట్లు రఘువీరుండు ఖర దూషణ త్రిశిరఃప్రముఖచతుర్దశసహస్రదానవులం బరిమార్చి మోక్షలక్ష్మీకల్యాణగౌరవంబు సంఘటించుఁ బదంపడి యుద్దానవి దేవదానవదుర్జయంబును త్రికూటశిఖరిశిఖరస్థితంబును రత్నసంపూర్ణంబును నవకోటిశివాలయాధిష్ఠితంబును వేదనినాదనాదితంబును ననేకరాక్షససంకులంబును నిత్యమంగళాలంకృతంబును నగు లంకాపురంబునకుం జని నిజాగ్రజుండైన దశగ్రీవునకుఁ దద్వృత్తాంతం బెఱింగించిన నతండును నిజభగినిం జూచి రాక్షసవినాశనంబునకుం బొడమిన

ధూమకేతువుగా నెంచుచు ని ట్లని వితర్కించు. 826

మత్త. మంటి నేఁబదిలక్షలేఁడు లమర్త్యులం బొడఁగంటి ము
క్కంటిపీటను విష్ణుపీటను కంజగర్భునిపీఁటనుం
గొంటి సంపద లెన్నియేనియుఁ గోరి చంద్రదినేంద్రులం
గంటి నైఁగ మెలంగఁజేసితిఁ గంటి సర్వసుఖోన్నతుల్. 827

ఉ. నందన మంతయుం బెఱికి
నాఁటితి మద్వనసీమఁ దత్తరుల్
బందను బెట్టితిన్ దివిజ
పత్నులఁ దక్షకముఖ్యనాథపా
త్పృందము నాదుపేరు విని
భీతిఁ గలంగు మదీయమందిరా
లిందమున న్వసింపుదురు
లేఖకులంబును దైత్యవర్గమున్. 828

వ. చతుర్దశలోకాధిపత్యవిరాజితుండ నై త్రిలోకదూరా
కం బైన యైశ్వర్యంబుసం జెన్నొందియు ననేకముని
సాధుబృందంబుల బాధించుచు నైశ్వర్యద్విగుణం బైన
పాపంబు భోగలుబ్ధుండ నై యాచరించితి నన్యక్షోభకర
ణంబు వెలిగ నైశ్వర్యంబు సంపాదింప నైతి. 829

తే. అయ్యు నిది వ్యర్థమయ్యె నీయఖిలలోక
జయము దేహంబు నైశ్వర్యసంగ్రహంబు

బంధుహితపుత్త్రిపౌత్త్రిప్రపౌత్త్రితతియు
జాలములు గాక పోతుఁ దీరాజాలఁగలవె. 330

వ. వారణాసీమరణంబును బ్రహ్మజ్ఞానంబును నిర్వాణప్రాప్తికిం గారణంబులు దురితచరితుండ నగు నాకు నీరెండును సిద్ధింపవు రాఘవుండు తండ్రియానతి నరణ్యంబునకేతెంచి యున్నవాఁ డమ్మహాత్మునిచేఁ గదనంబున మడసి ముక్తుండ నయ్యెద నాసత్యసంధుం డనపరాధుల హింసింపఁడుగావున నతనికి నొక్కయహితం బాచరించి తద్బాణహతి న్మృతిఁ బొంది ముక్తి వడసెద నని నిశ్చయించి మారీచుం డనురాక్షసునిం దత్కార్యసహాయార్థం బర్థించిన వాఁ డద్దశగ్రీవున కిట్లను. 331

చ. ఎఱుఁగుదు రామదేవు దను
జేశ్వర పిన్నటనాఁటనుండి మున్
దెలిసితి నమ్మహాత్ము శర
వేగము నైఁపక నైశవంబునన్
గలిచె ననేకదివ్యశర
కాండము లయ్యురువిక్రమాఢ్యుఁ డి
ట్టెడిఁ దరమౌనె యాఘను ను
దగ్రబలున్ రణభీముఁ దాఁకఁగన్. 332

శా. ఏశస్త్రాగ్రము రాఘవుం డసురలో
కేంద్రా విసన్ వాసవ

ప్రాతంబుం బొలియింప మానినుజన
ప్రాతంబుల న్మన్పఁ బ్ర
స్ఫీతపరిక్రియ ధర్మము న్నిలుప నీ
వ్యాప్తిగా జనించె న్వలో
పేతుం డాహవకర్కశుం డతనితో
నేలా విరోధింపఁగా. 883

క. రాక్షస! నీజీవితముగా
రక్షింపుము చెడఁగ నేల రామాగ్ని వెసన్
భక్షించుఁ దృణకణాకృతి
నక్షయశరశిఖల మర్కదానురవితతిన్. 884

తే. అతఁడు బ్రహ్మాండలయకర్త యగువిష్ణుండు
గాని కేవలమనుజుండు గాఁడు వినుము
ఖరవిరాధాదిదుష్టరాక్షసుల నెల్ల
సంగరావని నోడుచుట సాక్షిగాదె. 885

క. గిరిపక్షచ్ఛేదకరుఁ డగు
సురపతిగతిఁ బురము లీర్చ్యుశూలిగతిన్ భా
స్కరకులజుం డాలంబున
సురవైరులమద మణఁచుచునూ దనుజేంద్రా. 886

వ. కావున నాబుద్ధి విని రామదేవునితో విగ్రహింపకు మని
యనేకవిధంబుల బోధించిన గనలి యతండు మండలా
గ్రం బెత్తి దండింపం జూచిన వెఱచి యమ్మారీచుండు. 887

ఆ. ఖలుఁడు వీనిచేతఁ బొలిసిన రాక్షస
జన్మ మబ్బు రామచంద్రుచేత
నీల్గ ముక్తి యొదవు నిది మంచి దని యియ్యె
కొనును దశముఖుండు పనుచువనికి. 338

వ. అప్పుడవసరంబున నారదుండు రామసన్నిధికేతెంచునంత.

ఉ. నారికేళ పనస తినిశ నాగకేస రామ్ర మం
దార కుంద కదళికాది తరులు విరుల నబిలి చె
న్నారు ఫలసమృద్ధి నలరి యతనియాశ్రిమస్థలుల్
నారదునకు సంఘటించు నయనకంజపర్వముల్. 340

క. ఎదురేఁగి మ్రొక్కి యానా
రదునకుఁ బూజయొనరించి రఘుపతి యంతన్
వదనేందుజ్యోత్స్నాయుత
సుదరస్మితకాంతిగరిమ శోభిలఁ బలుకున్. 341

తే. అనఘ! మీరు గృహస్థగృహాంతరముల
తిరుగుచుండుట వారికి నతులభద్ర
నమితిఁ గృపసేయుటకుఁ గాక సర్వధనవి
రక్తు లగుమీకు వేఱ కార్యంబు గలదె. 342

వ. భవదీయపాదరజంబున నాగృహంబుపవిత్రం బయ్యె నని
పల్కిన విని నారదుండు. 343

సీ. హరుఁడవు నీవ బ్రహ్మవు నీవ విష్ణుండ
వీవ శక్రాది దిగీశగణము

గవ్యభుక్తతియుఁ బత్రిశశంఖవాసుకి
ప్రముఖఫణీంద్రులు నమరవరులు
వాలఖిల్యాదిదివ్యమునీంద్రులును నీవ
కపిలాదులును మహాకచ్ఛపంబు
మండూకపతియును మహి నీవె హృదయమున
ధ్యానముల వసించి భీతముల నెల్లఁ

తే. దివ్యదమ్ము కీలుబొమ్మల తెఱఁగు దోఁప
సకలమును నీ వెలుఁగనియర్థ మిద్ది
పంక్తిసదనుఁడు జగముల బాధ సల్పఁ
దెలుపవచ్చితి నవ్వార్త దేవరకును. 814

ఆ. మహతి యను విపంచి వహియించి యేను గా
నం బొనర్తు దనుజనాథునొద్ద
వేళ దప్పెనేని తాళశ దండించుఁ
బదరి వీణెకాయఁ బగులఁ నడఁచు. 815

తే. జలజగర్భుఁడు వేదముల్ సదువుచుండు
దితిజపతిమొద్ద వేళ యతిక్రమింపఁ
బరచపేటాహతుల నొంచు నతని సురలు
వెట్టిఁ గొట్టము చేసి సేవింతు రతని. 816

వ. ఇట్లు చతుర్దశభువనంబులకు బాధ గావించుచున్నవాఁ
డద్దురాత్మునిఁ బరిమార్చి జగంబులకు సేమంబు సంఘ
టింపు మని ప్రార్థించిన విని యారామదేవుండు. 817

సీ. శ్రుతిపరాయణు లందఱు సోమయాజు
లందఱును జపహోమక్రియాదినిరతు
లందఱు నహర్ముఖస్నాన మాచరింతు
రట్టిదశముఖముఖుల నే నెట్టులంతు. 348

కం. సోమకుఁడు శ్రుతులఁ గొని చన
నామును విష్ణుఁడు దెచ్చె నవ్వేదతతుల్
భూమి న్వ్యస్తము లైనన్
శ్రీమతి రావణుఁడు సమము చేసి పఠించెన్. 349

వ. అనిన విని యద్దేవమునిప్రవరుండు. 350

ఉ. వారలు విప్రదేవముని
వర్యవిహింసకు లార్యనిందకుల్
భూరికృపావిహీనులును
బుణ్యవిహీనులు సత్యహీనులున్
దారుణకర్మ లన్యవని
తాధనలోలుపు లద్దురాత్ములం
బోర వధించి యీభువన
ముల్ గృపఁ బ్రోచినఁ బాప మబ్బునే. 351

తే. స్మరహరుండును హరియు బ్రహ్మయును నీవ
దేవకార్యంబుకొఱకుఁ బంక్తిరథునింటఁ
బుట్టినాఁడవు రామ యిప్పాలసుదిండ్లఁ
దునుము లోకంబు లెల్లను మనుపఁగోరి. 352

వ. నీస్వరూపంబు చింతింపుము రాజనందనునకు దుష్టనిగ్ర
హంబును శిష్టపరిపాలనంబు నవశ్యకర్తవ్యంబు లని
రాఘవుం డమ్మునీంద్రుం గనుంగొని. 353

సీ. సత్యంబు నీమాట సంయమి! నారూప
మే నెఱుంగుదు లోకహితముకొఱకుఁ
బుట్టితి దశరథుపుణ్యగేహంబునఁ
గ్రవ్యాదవర్గంబు గర్వ మడఁప
సీతాహరణకాంక్షఁ జేరఁ బౌలస్త్యుండు
నా కనపాయిని లోకవినుత
నవనిజఁ దాఁచి మాయాసీతఁ గల్పించి
తత్కారణంబున దనుజుఁ ద్రుంచుఁ

తే. బాయు దర్శించుమాత్రన బ్రహ్మహత్య
యట్టిసేతువు జలనిధియందు నిలిపి
యాసుధాకరసూర్య మీయవనిఁ గీర్తి
నిలిచి కుశలంబు సంధింతు నిఖిలమునకు. 354

వ. అని పలికి యమ్మునీంద్రుం బనిచి భువనములందు మృ
త్యుదేవత నాకర్షించి నీవు లంకాపురంబునకుం జని రావ
ణాదిదానవులం ద్రుంపు మని పంచిన నది యిట్లను. 355

ఉ. రావణుఁ డేలు నప్పురవ
రంబు చొరంగఁ దరంబె నాకు నా

రావణు నాజ్ఞ లేక సుర
రాక్షస పన్నగ యక్ష ముఖ్యులుం
బోవంగలారె రాజసుల
భూషణ బాధ యొనర్చు నన్ను నా
ద్దేవవిరోధ మున్నతని
దిక్కున కేను నమస్కరించెదన్. 356

తే. విన నీయాజ్ఞ గైకొని యప్పురవరి
వేళ యొనరింతు దానవవీరువలనఁ
బ్రాణసంశయ మగు నని పలుక రాముఁ
డిట్టు లను దానితోడ నహీనఫణితి. 357

క. రక్కసిరాయని వెస నే
నుక్కడఁచెద వాఁడు చేరు నుగ్రాటవికిం
దక్కటి యసురుల నెల్లను
జక్కడఁపుము వానిపురికిఁ జని నిర్భయతన్. 358

వ. అని పలికి జానకిం జూచి. 359

తే. కంటివే సీత రావణు కైతవంబు
నీచవర్తనుఁ డైన మారీచుఁ గూడి
మాయచేయుంగఁ దలఁచె మన్మాయ దెలియఁ
గాన కాతండు దౌష్ట్యంబు కారణమున. 360

వ. అనిన సీత యిట్లని పలుకు. 361

సారె నరకకూపలోనఁ గుళికసేయు
నరుఁడు దుర్గతిఁ జెందు నింతయు నిజంబు. 864

తే. మును వసిష్ఠుండు వ్యత్యస్తముగ నొనర్చి
రామనామోపదేశంబు ప్రేమఁ జేయ
నా జపంబున వాల్మీకి యయ్యె శబరుఁ
డితఁడు రామాయణముసేయు నచలనిష్ఠ. 865

క. వ్యత్యస్త రామమునుజప
కృత్యంబున ద్విజతఁ గాంచెఁ గ్రించుకుఁడు దా
సత్యము ఋజుతరజపి యగు
సత్యజ్ఞము భాగధేయ మడుగఁగ నేలా. 866

వ. ఇట్లు భవదీయచరిత్రంబును భవన్నామమహిమంబును నత్యంతపవిత్రంబులై వెలయు ననిన జానకీదేవిపలుకులకు సంతసిల్లి రాఘవుం డప్పుడ మృత్యుదేవత నొక్క మాయాసీతఁ గా నిర్మించిన నమ్మాయాసీతయుఁ బ్రాంజలియై నిలిచి యమ్మహాత్ముతోడ. 867

శా. స్నానధ్యానజపాదిసత్క్రియలు ని
ష్ఠం జేయుమానీంద్రులుం
గానం జాలని శ్రీపదాంబురుహముల్
గంటిం గనుల్ సల్లఁగా
నే నేపుణ్యము మున్ను చేసితినొకో
నిత్యంబు నీసేవ యు

త్యానందంబునఁ జేయఁ గంటిఁ బనిగో
మ్యా భూరికారుణ్యలిగా. 868

క. అతిసుందరవిగ్రహులఁ దగు
పతి గలుగుట దుర్లభంబు పడఁతులకు స్వ
త్కృతసుకృతవశతఁ గలిగితి
పతులాకృతి నేను నీకు ననురూపఁగదా. 869

ఆ. పర్ణశాల యలికి పాకంబు సేయుదు
మూలవితతిఁ దానమునకు జలము
లందియిత్తు దేవతార్చన కలరులు
దెత్తు నుచితవిధులు దీర్చనిచ్చుదు. 870

క. చతురమతి నన్న దానం
బతిథుల కిడి యారగింపుఁ దనుజుఁడు నీపు
క్షితి జన్మజన్మములకుం
బతి వీవే కావలయును బార్థివ నాకుగా. 871

క. విహరింపుము నాతోడుత
నహరహము స్త్రీకు నిష్టమై యుండు గ్రక్షూ
ద్వహా నీసుందరరూపం
బహాహా వీక్షింప మిగుల నలరెం జూడుమా. 872

తే. వనచరులఁ గూడి లక్ష్మణ్ణ వనికి నరిగి
ప్రసవఫలమూలములు దెమ్ము దాకువేవ

సేయ జన్మంబు సఫలతఁ జెందు గాత్రి
మతిపవిత్రతరం బగు సనఘులకును. 873

వ. అనుచు మాయాసీత పలికిన విని నిర్వికారుండును స్వ
తంత్రుండును శివాత్మకుండును నైన రాఘవుండు సీతా
దేవిం దనయర్ధదేహంబున నిముడ్చికొనియె ని ట్లర్ధనారీ
శ్వరుండైన శరీరంబునం జెజరిల్లియు మాయాయవనికా
ఖిలీనుం డయ్యె నని చెప్పి శివుం డిట్లనియె. 874

ఆ. ఏను రాఘవుండ జానకి శైలజ
గాన యేకగాత్రకలితు లైరి
యట్టిరూపధరుని నారాముఁ దలఁచినఁ
గలుగు నిఖిలపుణ్యకర్మఫలము. 875

మ. భసితోద్ధూళితగాత్రుఁ బాటలజటా
భారు న్ధరానందనో
ల్లసదర్ధాంగు దరస్మితాంచితముఖో
ల్లాసు న్వరాభీతిహ
స్తసముజ్జృంభితుఁ జాపఖడ్గకలితున్
శార్దూలచర్మాంబరా
రసితుండై తలఁపం దదాత్మకత చే
రంజిల్లు మర్త్యుం డిలన్. 876

తే. అపుడు రావణుఁ డవనిజ నపహరింపఁ
దలఁచి పనిచిన మారీచదానవుండు

కుటిలమృగరూపధరుఁ డయి కూటసీత
యెదుట విహరింప దాని నయ్యువిద గాంచు. 877

సీ. విహరించు నల్లన విహగవహద్ధృతిని
నలవోకఁ బులుమేయు నాన గొఱలి
చరియించు నౌద్యాన చంచలేక్షణముల
ధవళకాంతులు తళత్తళలు గులుక
మెలయు నుజ్జ్వలహేమమణిమయాంగద్యుతు
లింద్రచాపప్రభ నినుమడింప
నడచు మెల్లన వసుంధరమీఁద ఖురహీర
దీధితుల్ రేయెండ తెరల వఱల

తే. గాలిదేవరమందురఁ గట్లఁ దొలఁగి
పాఱుతెంచినవార్యంబుపగిదిఁ బఱచు
నజునినిర్మాణకుశలత యుపహసించి
యందమున నందుఁ దిరిగె మిథ్యామృగంబు. 878

వ. అప్పుడు వినయావనతవదన యై సీత యామృగంబుఁ గో
డం గ్రీడింపం గోరి రామున కిట్లను. 879

తే. పతియె తల్లియుఁ దండ్రియుఁ బతియె తోడు
పతియె బంధుఁడు మిత్రుఁడు సుతులకును
భార్యయును దండ్రిసుతుఁడు నల్పంబు నిత్తు
రమితముగ నిచ్చు భర్త సెయ్యమున సతికి. 880

వ. కావున నమ్మృగంబుఁ దెచ్చి నాకు మనఃప్రియంబు గా

వింపు మనిన రాముండు తత్క్షణంబ శరశరాసనధరుండై
తదన్వేషణార్థంబు లక్ష్మణు నియోగించి యమ్మృగంబు
వెనుకొని యతిదూరం బరిగి విసివి. 381

క. ఆ లక్ష్మణాగ్రజుఁడు ప్ర
త్యాలీఢస్థానవసతి నమరి పలాశిన్
వాలమ్మున వ్రేయుటయున్
హా లక్ష్మణ యనుచు వాఁడు నసువులు దొఱఁగున్. 382

వ. అమ్మృగకళేబరంబు గొనుచు నతండు నిజాశ్రమంబునకుం
జనుదెంచె నవిన విని నైమిశేయు లటమీఁదటికథా
వృత్తాంతం బెట్లయ్యె నని యడుగుటయు, 383

ఉ. వైరవిణీమనోరమణ
ఖండశిఖండ యఖండగర్వదు
ర్వారమతంగజాసురజ
వప్రవిఖండనచండకాండ మా
యూరశిఖండమండనస
ముజ్జ్వలకాండ గవేశకాండ సం
తారకమండలాగ్రదిత
దానవమండల భోగికుండలా. 384

క. కర్మహారిసానుగర్భాం
తర్మగ్న జనౌఘవాంఛితప్రియధనన

న్నిర్మాణదక్షు దక్షవి
నిర్మితమఖతంత్రభంగ నిపాతానంగా. 385

వసంతతిలకము. తారాగిమందిర విధాతృకిరీటకోటీ
స్ఫారాబ్జరాగరుచిబంధురదీపరేఖా
నీరాజితాంఘ్రిపదనీరజ పేప వాహా
వారాశితూణ నిధివల్లభసఖ్యలోలా. 386

గద్యః ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితా ప్రభావ
యోందులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునం
షష్ఠమాశ్వాసము.



శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము

## నవమాశ్వాసము

శ్రీలలనాధిపమార్గణ
బాలార్కద్యుతిజటావిభారపినద్ధ
ప్రాలేయకిరణ దిక్పయ
చేలా చిన్మయవిలాస శ్రీగిరివాసా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిముఖ్యులం జూచి హరుండు సురగణంబులకుం దెల్పువృత్తాంతం బిట్లని చెప్పందొణంగె న ట్లమ్మాయరీచవచనంబులు విని సౌమిత్రిం జూచి సీత యిట్లనియె. 2

తే. అన్న లక్ష్మణ నిన్ను మీ యన్న దలంచె
సంధ్యవేళా దైత్యమాయ నే మరియొ నొక్కొ
చనుము తోడుగ వేగంబె చూపు మెఱసి
యనుడు జనకజం జూచి యిట్లను నతండు.

క. తెలి పేల నీకు రాముఁడు
కలికంఠుఁడు గాని నరుఁడు గాఁ డసురతతి౯
నులుమాడి వేగ వచ్చు౯
నెల వగుచేబలిమికలిమి నిక్కువ మబలా. 4

తే. అనుడు నాధోరణుఁడు మదహస్తి నంకు
శాహతిఁ గలంచుమాడ్కి నయ్యంబుజాక్షి
పరుషవాక్యాయుధముల నొవ్వఁ బలుక నోడి
యగ్రజుం డున్నదిక్కున కరిగె నతఁడు. 5

ఉ. ఆపటి భిక్షువేషధరుఁ
డై దశకంధరుఁ డేఁగుదెంచిన౯
భూతనుజాత నిక్కపుఁద
పోధనుఁ డంచు నమస్కరింపఁగా
నాతఁడు చేతు లిర్వదియు
నాననము ల్పదియుం దెలంగ నా
భీతమృగాక్షి కట్టెదుర
భీమతరాకృతితోడ నిల్చిన౯. 6

ఉ. రక్కసుఘోరరూపము తి
రంబుగఁ గాంచి నిమీలితాక్షి యై
యక్కమలాక్షి మూర్ఛిలఁగ
నంటఁగ నోడి త్రిశూలధారచేఁ

ద్రెక్కిన నప్పులాశి తద
ధిష్ఠితలోష్టము పెల్లగించి సొం
పెక్కు రథంబుమీఁద నిడి
యేఁగె విహాయసవీథి నొక్కఁడున్. 7

ఉ. ఆయెడఁ బక్షివంశమణి
యైనజటాయువు సత్త్వశాలి య
చ్ఛాయకుఁ జేరి పంక్తిరథు
సఖ్యము నెమ్మదిలోఁ దలంచి నే
నీయఘురాధముం గడపి
యీసుదతిన్ విడిపింపఁ గల్గు నా
కాయతశుభ్రకీర్తి యని
యాతనిఁ దాఁకె యకుంఠితోద్ధతిన్. 8

తే. గగనముఖతుండమున వానితను వగల్చె
నాతఁ డసిఁ గొని క్రోధరక్తాక్షుఁ డగుచు
వ్రేయ నది తప్పఁ గ్రుంగి యప్పీరుఁ జేరె
వజ్రినఖతుండహతిఁ బక్షివల్లభుండు. 9

వ. ప్రహరవ్యయవిద్ధుం డై మూర్ఛిల్లి కొండొకవడికిం దెలిసి
రాక్షసేశ్వరుం దప్పక శిక్షించి యాపక్షి రాక్షసులకు
నంగుష్ఠప్రదేశంబు మర్మస్థానం బది ఖండింపక మేలు చేసి
తని పల్కిన సమ్మిథ్యావచనంబులు నిక్కంబులుగాఁ
దలఁచి యాశకుంతకాంతుండు. 10

క. అక్షీణమ వానిపైనుఁవే
లక్షయజవళక్తిఁ దునుము నరుదేరఁగ నా
రాక్షసుఁడు ఖడ్గమునఁ ద
త్పక్షంబులఁ దునిమె నేలఁబడి తన్నుకొనన్. 11

చ. తను విడిపింపవచ్చి నిహ
తం బగుగృధ్రముఁ గాంచి సీత స
య్యన నిజభూషణప్రతతి
యంశుకఖండమునందుఁ గట్టి తా
ననువుగ నైచెఁ బంప యును
నావగ చెంతఁ జరించుకీశనా
థునియెదుటం బడెం దనుజ
ధూర్తుఁడు గాసకయుండఁ గ్రక్క నా. 12

తే. కరివ్యభుగాజసీత కైనె గగనపీఠ
ను త్తరీయంబు మునుఁ గిడి యువిద చనఁగ
ద్రవిడదేశాంగనలు సూచి లను హసింప
నరసి యమ్ముగ్ధ రోషతామ్రాక్షి యగుచు. 13

క. పయ్యెద దొలఁగిన నను మీ
రిప్యెడ హసియింపఁ ఖాదియే నేఁడుమొద
ల్పయ్యెదలు లేకయుండుఁడు
దయ్యంబులభంగి ద్రవిడకామురపాళుల్. 14

వ. అని దుఃఖార్తయై శాపం బొసంగె నారావణుండు వడి నిజ
పురంబు ప్రవేశించి సీతారూపాగత యైనమృత్యుదేవత
నశోకవనమధ్యంబున నునిచె నంత రాక్షసస్త్రీల వైధవ్య
సూచకంబులును, లంకాపురశృంగారవనవినాశసూచనంబు
లును నైనయుత్పాతంబు లనేకంబులు దోఁచినఁ గాంచి
నిమిత్తజ్ఞుండును మహాబలుండును నైనకుంభకర్ణుండు
దశగ్రీవున కిట్లనియె. 15

ఆ. అన్న చిత్తగింపు మవనిజఁ దెచ్చిన
నాఁటఁగోలె నీదునగరసీమఁ
బాపమె దుర్నిమిత్తములు పెక్కు లాసీత
సకలలోకములకు జనని సుమ్ము. 16

క. సత్యము తెల్పెద విను మా
ధ్యత్యంబున నవనితనయఁ దగ నంటెదవే
న్నిత్యం బగుతత్పాతి
వ్రత్యానలమేర్చు దనుజవంశస్త్రీలన్. 17

ఉత్సా. ఏల సాహసంబు సేసె దిట్లు దానవేంద్ర నీ
బాలతాంగి నచటఁ దెచ్చితచట నిల్పి తమ్ము డి
క్పాలవినుతకీర్తి రామభద్రనంజ్ఞ నసురులం
దీలుపఱుప నవతరించె దేవదేవుఁ డిమ్మహిన్. 18

తే. యాగకర్మస్థవిప్రుని ననపరాధి
వేదవిదుఁ ద్రుంపఁ బాధర్మవిదుఁడు రాముఁ

దహహా ! నీ దగుబాహుళదార్ఢ్యంబుకతన
నణఁగె నుత్తమవిప్రత్వ మమరవైరి. 19

వ. తత్కారణంబున నీకు వినాశంబు వాటిల్లుట సిద్ధం బని పల్కినఁ గుంభకర్ణువచనంబు లాదరించి ప్రహస్తుండు రాక్షసులనెల్ల నిరీక్షించి యిట్లనియె. 20

సీ. హేమమందరవింధ్యహిమనగేంద్రంబుల
బాహులఁ బెకలించి బంతులాడఁ
గలశౌర్యనిధి కుంభకర్ణుఁ డీతనిగాత్ర
మీక్షింపఁగా నోడి హేమగర్భుఁ
డక్షులెల్లను మూసి యక్షణంబున నిష్ట
మగువరం బిచ్చి పొమ్మనుచుఁ బల్కె
నితనిఁ జూడఁగ నోపరింద్రాదు లెదురించి
దివ్వయొనర్చుట చెప్ప నేల

తే. యిట్టిబలశాలి నీతమ్ము నిట్లు దెల్పు
టంతకునకైన రామునకైన వెఱచి
కాదు సోదరజీవితకాంక్ష గదుర
బంధుశోకాసహిష్ణుతఁ బలికెఁ గాని. 21

వ. కావున నీమహాత్మునిబుద్ధి యంగీకరించి మీరందఱు నేలికసన్నిధిం దెలుపవలయు ననినఁ బ్రహస్తువలుకులకు సమ్మతించి మయుండు రావణున కిట్లనియె. 22

ఉ. ఆర్య ! పులస్త్యవంశమణి
వధ్యయవేదవిశారదుండవున్
ధైర్యవివేకశాలివి పవి
త్రావనిశిష్టుఁడ విద్ధశౌర్యగాం
భీర్యధురంధరుండవు న
పేతకళంకుఁడ విట్టినీ వయో
దార్యవినింద్యదుర్గుణస
మగ్రుఁడ వైతివి వార్ధకంబునన్. 23

తే. వృద్ధుఁడవు గాన నీకు వివేక మొడలె
వయసు దిరిగినఁ బరలోకవాంఛచేఁ ది
తిక నిష్టంబుఁ బూర్తంబుఁ దీర్థయాత్ర
స్నానమును దానము జపంబుఁ జలుపవలెను. 24

సీ. వచ్చునే యిప్పుడు జవ్వనము వెండియు నీకు
నేల యిత్తెఱఁగున చేల వైతి
వారామునతి నేఁటి కపహరించితి దండ
కారణ్యవీథిఁ దత్కారణమున
హాతుఁ దమ్మో పూరించుఁ దగుఁగాక యిం కెట్టి
ఫలము సేకుఱు నీకుఁ బలభుగీశ
యాదిరకాలంబున నడఁగు నధర్మంబు
ధర్మంబు వర్ధిల్లుఁ దరతరంబ

గ్గాతపుఁ ధర్మగేహిని న
కల్మషఁగా నొనరించెఁ బాదకం
జాతరజోవిశేషమునఁ
జయ్యన నక్కుమారకాఖ్యయుం బలా
రాతిసుసంగలబ్ధ మగు
ప్రస్తరభావము వాసి నయ్యెడన్. 29

సీ. మిహిరకులనందనుం డంత మిథిల కరిగి
యొంటి బిసకాండమును బోలె ఖండపరశు
చండకోదండదండంబు ఖండములుగఁ
జేసి భూపాలనందని చేఁ బాగడ. 30

ఆ. ఆ స్వయంవరోత్సవాలోకనార్థి వై
యరిగి కాంచి తీవు నమ్మహాత్ముఁ
దమరమనుజవిస్మయాపాదిసౌందర్య
నిలయుఁ డగునొ కాఁడొ నిజము సెపుమ. 31

సీ. జానకీసహితుఁడై సాకేతనగరికి
నరుగుచుఁ గోత్రధరకాంతనయునుఁ
[illegible] రాజతాచల
పులితాంగుఁ బ్రళయాగ్నిమూర్తిరీతుఁ
గార్తవీర్యభుజావిఖండనపాండిత్య
స్కంధావలంబితశాతపరశు

ధృతచాపు నేకవింశతివారభూరమ
ణాంతకరమర్దను యమునమాను

తే. యుద్ధసన్నద్ధు భృగురాము నుగ్రధాము
వీరవరుఁ గాంచి రాముఁ డోవిప్రవర్య
బలము లన్నియు నినుఁ గని పఱవఁదొడఁగె
నెద్ది కారణముగ వచ్చి తెలుపఁ జెపుమ. 82

వ. అనినం బరశురామదేవుం డను. 83

తే. విప్రుఁ డని పల్కితివి నన్ను వినుము నీగృ
హాంగణమునకు సన్నభిక్షార్థి నగుచు
నరుగుదెంచినవాఁడనే ? యూరకెట్లు
దక్కె నోరుచేతఁ గొందునే దాన మనిన. 84

తే. చండగతి రాఘవుంపు కోదండకాండ
మెక్కిడి శరంబు సంధింప నుక్కడఁగి
భార్గవుఁడు వీతలజ్జుఁడై ప్రాణభీతి
నతని శరణంబుసొచ్చి యిట్లనుచుఁ బల్కె. 85

ఉ. దేవ! యజాండభాండములు
దీలఁగఁ జేయుచాఱుండ వీవు లో
కావళి నెల్లఁ బ్రోవ మను
జాకృతిఁ బొల్చితి వట్లు గానిచో
భావభవారివి ల్లనుమఁ
బ్రజ్ఞఁ దొరుండు భరం గలండె య

తే. సాధనంబు భుజించుచు నాదుశత్రు
పక్షపశవర్తి నైతివి పాపకర్మ
యధిపుకార్యంబు విడిచి పరార్థకార్య
ఘటకుఁ డగువానిజన్మంబు గాల్పు టురవు. 39

వ. అని యతనిపై ననుకంప లేక త్రుంపం జూచుసమయం
బున నారావణునియ్యాంపుఁదొయ్యలి యైనమండోదరి
యిట్లనియె. 40

తే. ముదుసలితనంబు గదిరిన మునులకైన
కీటఁబోవు సునీతి వివేకసరణి
యనినచో, నెందులకొ వేఱ యరుగ నేల
యీవె దృష్టాంత మిందుల కిందనైరి. 41

క. ధర్మంబు లపాకరంబు న
ధర్మము జయాకరము ననుచుఁ దగఁ బలుబుద్ధిఁ
దుర్మతి వలికెడుఁగాని య
ధర్మాత్ము వహింపలేదు ధర యొల్లపుడున్. 42

తే. ధర్మ మెచట నుండుఁ దడయక యచ్చట
జయము గల్గు ధర్మసంగ్రహంబు
చెడఁ డధర్మరతుఁడు చెడుఁ దత్ప్రసంగతి
సార మడఁగు క్షీరపూర మట్లు. 43

ఉ. మానిజనాశ్రమంబులు గ్రొ
మంబుగఁ బాడుగఁ జేసి దేవతా

మానినులన్ హరించి గరి
ళుం జెఱఁ బెట్టితి దుర్వినీతిచే
మానవనాథులం బిలుకు
మార్చితి పేర్చినవిక్రమంబునం
దానవనాథ యిట్లు గతి న
ధర్మము చేసితి వెల్లవేళలన్. 44

మ. భవదానీతపతివ్రతాతిలకముం
బచ్చిత్తసంక్షోభనం
భవకోపాగ్ని ధరాత్మజాపమరు
త్ప్రాప్తిన్ దురాధర్షమై
భవదీయాన్వయమునీరసాటవిపయిం
బాటిల్లి యేర్చున్ మనో
భవుఁ బాటించినధర్మదూరులకు సం
ప్రాప్తింపవే యాపదల్. 45

శా. మాయాభిక్షుఁడవై హరించితివి రా
మప్రేయసిన్ రాముఁ డ
ప్పాయన్ * లేమిని దీన నేమి కలుగున్
జానొందు నీనెమ్మదిన్
మాయాకృత్యవిశారదుండ ననుచున్
మత్తిల్లె దాబామున

* లామిడి దీః; లామిడి సైఃా—ఖ్రి ప్రి.

న్మాయామార్థికి నీదుమాయలు ధర
న్నాదేయకల్యాణతంల్. 46

సీ. అతనిమాయాంబుధి నబ్జగర్భాదులు
మునుఁగుచు నుందురు మోహవశత
వరవర్ణినీధనావర్తద్వయంబునఁ
బడి మును లైనను గడవలేరు
ప్రకృతిజాగుణబద్ధులై పరగెడు
దానవు లవ్వార్ధి దాఁటఁగలరె
రామానపాయిని యామహీసుత శివు
నర్ధాంగమున నుండు నార్యవోలె
తే. భర్తృదేవత గాన యప్పద్మనయన
వల్లభునితోన చనుదెంచె వనికిఁ దత్ప
రోజముఖిఁ దెచ్చి యూరక యున్నవాఁడె
యతనివంచనఁ దెలియుతే జైతి గాక. 47

సీ. బాహుబలాఢ్యు సుబాహుఁ ద్రుంచి మఖంబు
గావంగ జానకిఁ గావలేఁడె
పతిశాపహత యైనసతి నహల్యాదేవి
గావంగ జానకిఁ గావలేఁడె
ఖరవిరాధాదుల ఖండించి మునితతిఁ
గావంగ జానకిఁ గావలేఁడె

శబరికిఁ బతితాంకకబరికి గతు లిచ్చి
కాఁపంగ జానకిఁ గావలేఁడె
తే. సారుఁడవు హాటకగర్భుండవు హరియు నతఁడ
బహుళమాయావి జనులకుఁ బ్రభుఁ డతండ
యువిద నతఁడం రక్షించియు యున్నవాఁడు
నీవు దెచ్చుట మిథ్య యోనిర్జరారి. 48
వ. అది విని ట్లంటేని. 49
తే. మృత్యు వీలంతఁ జొరలేక మిడికి రాము
శరణు భజియింప నమ్మహాపురుషవరుఁడు
నిను సబాంధవముగఁ దునుంచుమనను పూని
దాని సీతగ నిర్మించె దనుజవర్య. 50
ఉ. రాముఁడు ధార్మికుం డనఘ
రాధుల సాధుల బాధసేయఁ డా
రాముని కీ వొనర్చి తిప
రాధము నీదగు భూసురత్వముం
గాముకవృత్తిఁ బూని పర
కాంతలఁ జెందుటఁ బోదొ; నయ్యెఁ బో
యీమహి రాముకార్యమును
మృత్యువుకార్యమౌఁ బ్రాణనాయకా ! 51
క. మృత్యువు నిచటికిఁ దెచ్చితి
సత్యం బది సీత గాదు దని రాముని కా

మృత్యువు మరల నోసఁగి కృత
కృత్యుఁడ నై బంధుజనుల నెల్ల మనుపుచూ. 52

వ. అని తెలుపుచుండె నగివచనంబు లాకర్ణించి రావణుండు
మిక్కిలి సంతసించుచుట. 53

తే. రాముదేవుండు తమ్ముని రాకఁ గాంచి
నేమిటికి నచ్చి తీ వమ్మ కీలఁజ డించి
యామగువ నిన్నుఁ బరుసోక్తులాడి నోర్మ్-
కామినులపల్కులకు మేర గలదె చెప్పుము. 54

క. తముఁ గినిసిన మన్నించిన
సమదృష్టిని మగనిఁ గవయుచానలు నైకుం
తమునం గైలాసంబున
నమరావతి నైనఁ గలుగ రివనిం గల్గే. 55

తే. తెలివకు విధేయుఁ డగుచు వర్తించువాఁడు
పూరుషాధముఁ డతని నప్పుడుప్పుఁబోఁడి
కోర్కెతీవలెఁ ద్రిప్పుచుండు నిక్కువము ధాత్రి
పతివ యధికార మైన గేహము నశించు. 56

తే. లలన మగవానియందగ దలియఁదీక
మనుచు దుష్కరతర మగువనికి నైన
స్త్రీవిధేయతచే నేనుఁ, జెలఁగి దాన
ధర్మమును నీవు విచట విదర్శనంబు. 57

తోటకవృ. అని లక్ష్మణుఁ బల్కుచు నాయనతోఁ
జనుదేర నిజాశ్రమశాలకుఁ జ
య్యన నేఁగి ధరాత్మజ యచ్చట లే
మి నలం డట వల్కె సుమిత్రిసుతుణ్. 58

తే. పద్మమిత్రాభ కంటె ? యిప్పర్ణశాల
విన్ననై యున్న దయ్యలివేణి లేమి
మంజుభాషిణి సీత యమ్మహిషిఁ బాసి
మెలమి విరహానలంబు సహింపఁదరమె. 59

వ. అని వంచనావచనంబులం దమ్ముని మోహపఱుచుచు
నతండునుం దానును సీతాన్వేషణంబునం జని చని గౌత
మీసరిత్తీరంబున నిలిచి. 60

క. రావణుదుశ్చేష్టలు గో
దావరి మెఱిఁగింపదయ్యెఁ దా నిపుడు జగ
త్పావని ననుచుం బటుద
ర్పావిలమతి నగ్ గణింప దయ్యెం గంటే. 61

తే. గౌతమీ నేఁడుమొదలు నిక్కంబు గాఁగఁ
బావనార్థంబుగా నీదుజీవనముల
స్నాత యగువాఁడు చండాలజాతిఁ బుట్టి
జగతి నస్పృశ్య యాత్మ తేజంబుఁ దొఱఁగు. 62

చ. అని శపియింప గౌతమియు

మ. విజితద్వంద్వులు కందరాశ్రియులు సం
    విద్భుక్త్యాలబ్ధశ
ద్ధజటాభారులు నైన తాపసులు సము
    ద్యన్నిష్ఠ వీరి గాంచిరే
నిజజన్మాంతరపుణ్య పుట్టిదయో నీ
    నీమూర్తిఁ గాంచెం దరు
వ్రిజవల్లీతృణగుల్మసన్మృగఖగ
    వ్రాతం బరణ్యస్థలిన్. 68

చ. అనితరలభ్యమైనభవ
    దంఘ్రులఁ బూజ యొనర్చుభాగ్య మి
ద్యమునులకు నబ్బె నీఘనులు
    మున్నొనరించినపుణ్య మెట్టిదో
యనఘపవిత్రపావకఘ
    నాశ్రయశోభిత యాట నివ్వనా
వని శివవిష్ణులోకముల
    వైఖరి నొప్పు మహత్త్వసంపదన్. 69

క. ఆశాప్రముఖపచ్చరణా
జ్ఞాతాంకిత మగునిజోటజవ్రిష్ఠలి నీ
వాతిథ్యము గొనియుండిరి
చేతోమోదమున మౌనిశేఖరు లెల్లన్. 70

ఆ. వనజసంభవాదు లనిశంబు నీదర్శ
నంబుఁ గోరి యవసరంబుఁ గాతు
రట్టినీకుఁ బాకయత్నంబు సేయుత
పస్వికాంత లెంతభాగ్యవతులొ. 71

తే. స్వామి భవదీయదర్శనస్పర్శనములు
గాంచి మునులు కృతార్థతాగరిమఁ గాంచి
రమ్మహాత్ములు మత్తీర మాశ్రయించి
నిలుచుటను భాగ్యవతి నేన నిక్కువంబు. 72

తే. రాముఁ డరుదెంచు మన్మందిరంబున భుజి
యించు నేఁ డని మునిసతు లించువేడ్కఁ
గందఖర్జూరపనసమాకందములను
దుగ్ధదధ్యాజ్యములను దెచ్చిరి ముదమున. 73

ఉ. భూమిభరంబు *డింపు గడు
బుద్ధి సమస్తజగద్ధితార్థమై
రాముఁడు దండకాటవికి
రాఁగలఁ డత్తఱి మత్తటంబునం
జేరి వసించు నాఁ డని య
పేతకళంకతఁ బొల్పునంచు నే
వేమఱుఁ గొల్చుచుండ రఘు
వీర వసించితి వట్లు మత్తటిన్. 74

---

* దింపుటకు—వ్రా. ప్ర.

మ. హరిపాదోద్భవ గంగ యంచు నను న
త్యంతంబు మన్నించి యి
ప్పరమర్షు ల్వసియించి రిత్తటి భవ
త్పాదాబ్జకింజల్కపుం
జరజఃస్తోమపవిత్రితాంగ నగుటం
జన్మౌనిసంఘంబులం
దురితోన్ముక్తులఁ జేయుదుం దరదమ
ద్దుర్వారవారాప్లుతిన్. 75

తే. ఇట్టినన్ శాపహత నైన నిమ్మునీంద్రు
లహరహస్స్నాన మేగతి నాచరింతు
రనఘ సుస్నానహీనంబు లైనక్రియలు
భస్మవిన్యస్తహవ్యంబు పగిది గాదె. 76

వ. వేదశాస్త్రపురాణపారగులును, సర్వధర్మవిదులును, శాంతులును, సోమయాజులును, ద్వాదశాహదీక్షితులును, వాజపేయవ్రతపతులును, పౌండరీకయాజులును, వసంతయాజులును, చాతుర్మాస్యయాజులును, నిత్యయాగపరులును, తపస్స్వాధ్యాయపరులును, జీర్ణపర్ణజలాహారులును నైనమునీంద్రులు నాయందు విరక్తులై రామంచాకవాటికి కరిగిన దండకారణ్యవాసు లగురక్కసుల నుక్కడంచి మునీంద్రులఁ బ్రోచుటకుం జేసినభవదీయప్రతిజ్ఞావైఫల్యంబు సంభవించుఁ దత్ప్రతిజ్ఞాభంగభీత

నై నీకరణంబుఁ జొచ్చితి మునియును. 77

ఆ. పురుషునింట సర్వభోగాఢ్య యయ్యును
గన్య పుట్టినిల్లు గాంచుసేయు
నందు నల్పమైన నత్యధికంబుగఁ
గాంచుఁ దండ్రిమీఁది కరుణకలిమి. 78

గీ. కన్య నలరించిరేనియుఁ గలిమి వొదలు
క్షుభితఁ గావించిరేనియుఁ గులము వ్రీలు
జగతి బాలురఁ గన్యల స్థవిరుల నవ
మాన మొనరించిరేని సంపద తొలంగు. 79

చ. అనిలము నాకసం బనలుఁ
డంబులు గంధవహుండు సర్వసం
భువననదీవిహంగపశు
దుష్టమృగావళియు న్నిజస్వభా
వవిధి వసించుఁ గాని నర
వారములో దుతఁ బల్కనేర్చునే
తపసిని నేను భాగ్యవతి
నోట నిజం గని బల్కనేర్చితిన్. 80

క. కావున నీపుత్త్రి ననుం
గాత్రము కజ్జ్వలించుఁ గాంచుము నీ భా
షావృత నగుటం జుమ్మీ
జీవాప్తిం గలఁగు లోక మాతను మునీంద్రా! 81

క. అని పల్కు నవసరంబున
వనరుహసంభవుఁడు త్రిదశవర్గము గొలువం
జనుదెంచి రామదేవుని
వినుతించుచుఁ బల్కె నిట్లు విస్ఫుటఫణితిన్. 82

గీ. అనఘ భవదంఘ్రిచిహ్నిత మగుటఁ జేసి
పావనం బయ్యె నీదండకావనంబు
తరువు లామరతరువులవోరువు దోఁప
నమితసుమఫలనమితంబు లయ్యెఁ గంటె. 83

క. పుణ్యాత్ము లైరి మౌని
వ్రాతంబులు నీదుపాదవనజంబులు సం
ప్రీతిం గాంచి భజించుచు
నాతిథ్యముసేయఁ గాంచి రతులితభక్తిన్. 84

క. ఈవు వసియించుభాగ్యం
బీవనికిం గలిగెఁ గాక యి ట్లీల యగుఁనా
శ్రీవరునగరికి నైన మ
దావాసంబునకు నైన హరుపురి కైనన్. 85

సీ. నీపదనీరజాతమున
నీవె సృజించితి పావనార్థ మి
య్యాపగ నీమశాపహత
మైనఁ దదీయఘనప్రతీరసు

స్థాపిత దేవతాయతన

సంచయము నంతయు శాపదగ్ధమై

యేపటి లోకపావనత

యేఁగితిఁ గల్గు నరిల్లలావుకున్. 86

వ. కావున గంగాశాపంబు మరలింపవలయునని ప్రార్థించినఁ
జతురాననుపల్కు లాకర్ణించి రఘువల్లభుండు. 87

తే. శబరి మద్భక్తురాలు సుస్నాన మాచ
రించు నొక్క హ్రదంబున నింటు వేక్కఁ
దజ్జలంబులతోడ నిత్యంబుఁ గలసి
గౌతమీగంగ శాపమోక్షంబుఁ గాంచు. 88

తే. ప్రార్థి శబరీహ్రదంబుసంపర్కలబ్ధ
నఖిలలోకైకపావని యగుచు గంగ
పానఁ దీరినరత్నంబుచంద మొందు
నింద కర్షామె మద్భక్తబృంద మొందు. 89

తే. పడఁతులకు శూద్రులకు బ్రహ్మబంధులకును
లేదు కర్మాధికారిత లేశమైన
యవిరతము దుష్టకర్మము లాచరింతు
వాడబుఁడు బ్రహ్మబంధుఁడు పద్మగర్భ. 90

చ. కొలకులనీరఁ గ్రుంకు లిడి

కంజదళములు ల్కరల మటారజం

క. అని యతని సత్యసంధుం
దని తలఁచుచు నీయభీష్ట మడుగు మనుడు వాఁ
డును దేవ నిన్నుఁ గాంచితి
ఘనతర మగుభాగ్య మింతకంటెం గలదే. 95

క. అని పలికి యమ్మహాత్మునిఁ
గనుఁగొనుచుం దనువుఁ దొఱఁగె ఖగపతి యంతన్
జనకునిగతిఁ గాంచుచు నా
యనఘుఁడు సురలోకమునకు ననిచెఁ దానిన్. 96

వ. అంత. 97

తే. యోజనద్వయదీర్ఘబాహుని నురస్స్థ
వదనగహ్వరు దానవవరుఁ గబంధుఁ
జదిపి నిజభక్తురాలగు శబరిచేత
నర్చఁ గైకొని యాపెఁ బూతాత్మఁ జేసి. 98

శా. కాంచెన్ రాఘవుఁ డిక్షుకాండరసనీ
కాశాంబుసంక్రాంతముం
జంచన్మందమరుత్ప్రహృష్టపథిక
స్వాంతంబుఁ బద్మోత్పలో
దంచత్సారమరందమత్తమధుప
ద్వంద్వస్వనోదంతముం
బ్రాంచత్క్రౌంచముఖాదినాదవిలస
త్పంపాసరఃప్రాంతమున్. 99

తే. అపుడు గౌతమిసుత యైనయంజనాత
నూజుఁ డనుపమతేజుఁ డనూనసీతి
మంతుఁ డచలితధృతి హనుమంతుఁ డంత
నమ్మహీకాంతుఁ గాంచి యిట్లని తలంచె. 100

మ. భసితోద్ధూళితకాయుఁ డంబుధరశుం
భన్మేచకాంగుండు పా
ణిసరోజాంచితచాపగోపవరుఁ డు
న్నిద్రాంబుజాతాక్షుఁ డు
ల్లసదాజానుభుజార్గళుండు సుమన
శ్శ్లాఘ్యవ్యక్తమావంతుఁ డీ
యనమస్థైర్యగుణాఢ్యుఁ డెవ్వఁడొ సము
ద్యద్భానుతేజుం డిలన్. 101

శా. సాక్షాన్మన్మథురీతిఁ బొల్చె నితఁ డ
క్షయ్యాకృతిన్ వారిజా
క్షుండో శశభృత్కలామకుటుఁడో
యంభోజసంభూతుఁడో
యీక్షోణిన్ నరమాత్రుఁడే యితఁడు లో
కేశుండు గాకారయన్
సాక్షం బియ్యెడ యిమ్మహాపురుషు స
న్మోక్షదంబునన్ జూచినన్. 102

క. ధైర్యంబున హిమగిరి గాం
భీర్యంబున నుదధి తుహినభానుఁడు పృథివి దలంపఁగ
స్థైర్యంబున సురగిరి సౌం
దర్యంబున నితఁడు కుసుమధన్వుఁడు జగతిన్. 103

సీ. ఇతనిమాయాంబుధిఁ జతురాననాదులు
తీరంబు చేరక తిరుగుచుండు
రితఁడు జగంబులకెల్ల జనిస్థితి
సంహారకర్త నిస్సంశయంబు
నిర్వికారుండును నిత్యుండు సత్యుండు
సర్వజ్ఞుఁడును నిరంజనుఁడు నితఁడు
సనకప్రముఖులైనమునులకు నీతని
పదదర్శనము దుర్లభంబు దలఁప

ఆ. నీతఁ డలిగెనేని హిమాద్రి తృణ మగు
నితనికరుణ గలుగుతృణము మేరు
వితఁడు పూజనీయుఁ డీతని సేవించి
కమలజాండమునకుఁ గర్త నగుదు. 104

క. ఇతఁ డస్మదిష్టదేవత
గతి నొప్పెడు విష్ణుమహాత్ముఁ గనుఁగొంటిఁ గ న
స్తుతి మత్పవగర్వ మదూ
[illegible] మిత మగు యతిక [illegible] నితనిసేవ దాంచనర్పన్. 105

తే. అవి తలంచుచు ఫలపాణి యగుచు నాతఁ
డాత్మనామానుకీర్తనం బాచరించి
వెండ్రిక్క యారఘునందనునెఱ్ఱిల నిలిచె
సంజలి ఘటించి వినయానతాంగుఁ డగుచు. 106

మహాస్రగ్ధర.
కనకాద్రీంద్రాభు నుద్యత్కనకమణిపరి
ష్కారయు నాషాఢదండా
జినహారాంజీమేఖలారంజితు జితమదను
జిత్రభానుప్రకాశున్
ఘనశౌర్యుం దీర్ఘబాహార్గళు ననిలజవుం
గామరూపాభిరాము
హనుమంతుం గిరికాంతుఁ హరిపరివృఢు న
ర్కాన్వవాయుండు గాంచెన్. 107

ఆ. అట్లు గాంచి యద్భుతాక్రాంతచిత్తుఁడై
యేమి గోరి వచ్చి తెలుఁగఁ జెపుము
ప్రాణసదృశుఁ డైన బంధునిగతిఁ గను
పట్టె దీవు మాకుఁ బ్లవగవర్య. 108

వ. భవత్సహాయంబు గల్గిన మహావాయుసహాయుం డైన
ప్రళయాగ్నిభంగిం బొంగి రక్కసుల నుక్కడంతు మా
ర్గదర్శి యగుపురుషుం డొక్కరుండు తెలిసి చింతించెద
మద్ప్రాణానలంబునకు మేరుమందరాంబరపృథివీసింధువు

వైనను నిలువఁజాలవు నుద్భక్తుల ధేనువు వత్సంబులం
బోలె రక్షింపుదు నని పలికి నిజవృత్తాంతం బంతయు
వివరించినఁ విని సంతసిల్లి రఘునందనునకు వాయునంద
నుం డిట్లనియె. 109

సీ. వాలిసుగ్రీవు లన్వానరుల్ కేశాధి
పులు నన్నదమ్ములు గలరు బలులు
దారానిమిత్తమై వారల కుదయించె
వైరానుబంధం బవార్య మగుచు
నిల మహాత్ముల కైన నింతులకతన వై
రము గల్గు నన మర్కటముల కరుదె
శక్రనందనుఁడు నిర్వక్రవిక్రమశోభి
వాలి మహైశ్వర్యశాలి యగుచు

తే. ననుజపత్ని రుమాకాంత నపహరించి
తారఁ గైకొని యచలితవైరకలనఁ
బ్రాణములఁ గొన నల్గినఁ బఱచె నతఁడ
ధర్మవర్తులకడ నుండఁ దగదు గాన. 110

తే. అంబుధినిమగ్నునకు నుడుపంబుకరణి
ధ్వాంతబాధితునకు వికర్తనునిపోల్కి
రహిఁ దరిద్రునకును ధనరాశిపోల్కి
నీవు గల్గితి రవిపుత్త్రునియతికతన. 111

చ. జనకునియాజ్ఞ నివ్వనికి
సన్మతి రాఘవుఁ డేఁగుదెంచె న
య్యనఘుఁ డమేయశౌర్యనిధి
యార్తశరణ్యుఁడు దుష్టశిక్షణం
బనువుగఁ జేయు సజ్జనుల
నందఱ మన్చు దయార్ద్రచిత్తుఁ డా
ఘను శరణంబు సొత్తు ననుఁ
గాచు నతం డని యెంచు నాతఁడున్. 112

వ. త్రిభువననాథుండును, ప్రతిజ్ఞార్థపాలకుండును నఖం
డప్రచండపాండిత్యశౌర్యుండును నగునమ్మహాత్మునితోడ
సఖ్యంబు సంఘటింపు మని యాసుగ్రీవుండు పనిచిన
నేఁగుదెంచితి నిట మీఁద దేవరచిత్తం బని పల్కిన విని
రాఘవుండు సుగ్రీవుం దోడ్కొని ర మ్మతని కభయం
బొసంగితి నని యానతిచ్చిన నమ్మారుతియు నట్లు సుగ్రీ
వుం దోడితెచ్చుచు నుండె నాసమయంబున. 113

క. పరిఫుల్లహల్లకాంబుజ
మరందలహరీప్రమత్తమధుకరఝంకృ
స్స్వరపూరం బగుపంపా
సరోవరముఁ గాంచి రామజనపతి పల్కెన్. 114

తే. పాపసంతాపఘర్మనిర్వాపణాచ్ఛ
సలిలసంపరిపూర్ణమై సన్మునీంద్ర

చిత్తకమలంబు గనఁడే వెలుగు మెఱసెఁ
జూచితే దీని లక్ష్మణా చూడ్కి కెరఁ. 115

క. గంగ తొంగలిగ సముదయు
సంగతి చక్రాంగరేఖ చాలఁగ నొప్పెఁ
శృంగారార్థముగా నవి
లాంగన ధరియించు తారహారాళి యనఁగ. 116

వ. అని వెండియు. 117

మ. అనఘా లక్ష్మణ కంటె యొక్కబక మీ
యచ్ఛోదతీరంబునన్
మునిలీలం దప మాచరింపఁ దొడఁగెం
బో ధార్మికత్వంబునన్
విను మీ క్షేత్రమహత్త్వవిస్ఫురితిఁ జూమీ
విజ్ఞానసంపత్తి సాం
పునఁ దిర్యక్కతియుం దపంబు సలుపుం
బూజ్యప్రభావంబునన్. 118

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 119

తే. దీనిశీలంబు దెలియక దేవ యిట్లు
వాగడ నేఁటికి సురమునిభూసురులను
యతులనైన సంతశ్శుద్ధి పొరయదు కార్త్య
సంస్తుతించిన దోషంబు సంఘటించు. 120

తే. ఇచటఁ గొండొకదడ వున్న నెఱుఁగవచ్చు
ననఘ దీనిశీలం బనునంతలోన
ననఁగు నప్పుడ కదసి మత్స్యముల మ్రింగి
పండియును ధ్యాన మొనరించుచుండఁ గాంచి. 121

క. సౌమిత్రిఁ బాగ డై రాఘవుఁ
డామెయి హనుమత్సమేతుఁ డై రవిజుఁడు ను
ద్దామగతి వచ్చి రాముని
శ్రీమత్పదములకుఁ బ్రణతిచేసి నుతించెన్. 122

వ. ఇట్లు కుశలప్రశ్నంబు చేసి యమ్మహాత్ముం డిట్లనియె.

క. సుగ్రీవ నీదుశత్రు ను
దగ్రబలుఁ వాలిఁ దునిమి తారక రుమ న
వ్యగ్రమతి నొసఁగి కపిరా
జ్యాగ్రశ్రీఁ గావింతు నిన్ను నళు కేల యిఁకన్. 124

వ. నీసాహాయ్యంబున నేను దశగ్రీవుని సంహరించెద నని
యగ్నిసాక్షికంబుగా సఖ్యంబు చేసి యతనితోడన
ఋశ్యమూకగిరీంద్రంబునకుం జని యందు వసియించి. 125

చ. హరివర నీవు వోయి కల
హం బొనరింపుము వాలితోడ నేఁ
దరువుమఱుంగున న్నిలిచి
తత్సమయంబున వాని ద్రుంచెదం

దురమున వానితో నెదురఁ
బోఁదగ శక్తి బొలంగుఁజూపె నొ
వ్వరికయినన్ మునీంద్రకృప
వానికి నట్టివరంబు గల్గుటన్. 136

వ. అని పల్కి యతండు. 137

ఉ. అలరులకమ్మగంధ మయిపూ
పాతనికంధరఁ బ్రత్యభిజ్ఞకై
నిలిపి దురంబు సేయు మన
నమ్మది నారఁడు నట్లు వాలితో
బలుకక పోరఁగాఁ దొడఁగె
నాసమయంబున నద్భుతాగ్ర్యుఁ డు
జ్జ్వలవిశిఖాహతిం దునిమె
శక్రతనూజుఁ బరాక్రమంబునన్. 138

తే. వాలి విక్రమశాలిని లీలఁ జదిపి
తారఁ దారాధిపాస్య నవ్వారిజాప్త
సూనునకును రుమాకాంతతో నొసంగి
మహితవానరరాజ్యసామ్రాజ్య మొసఁగె. 129

క. రాముఁడు గిరిగుహ నుండఁగఁ
దామరచెలిపట్టి ప్రేమఁ దారావరుఁడై
యామున రాముని కార్యం
బేమఱి కామాంధుఁ డగుచు నింట వసించెన్. 130

క. ప్రమదలసన్నిధి నుండిన
సమయజ్ఞానంబు దొఱఁగు సకలజనులకుఁ
క్షమ సలెఁడు కొమ్మమెలి మాఁట
యమరఁ బ్రమత్తత వహించుటది యద్భుతమే. 181

ఉ. ఆసమయంబునన్ రఘుకు
లాగ్రణిపంపున లక్ష్మణుండు బా
ణాసనశాతబాణధరుఁ
డై విలయాంతకులీల నేఁగి య
వ్వానరరాజనందనుని
వాకిట నిల్చి *యమర్షరౌద్రదృ
గ్భాసురుఁడై కఠోరగతిఁ
బల్కె బలీముఖు లెల్ల భీతిలన్. 182

ఉ. వాలికి భీతిఁ జెంద రఘు
వర్యుఁడు నిన్గృపఁ గాచె మున్ను నా
వాలికతూపుచే నిపుడ
వారణ నిన్ బరిమార్పఁ గావఁగాఁ
జాలునె యంతకుం డయినఁ
జక్కసజాండవిభేదమైన యా
భీలమదీయసాయకము
భీతులఁ గ్రోఁతుల నొంపఁజాలదే. 183

* యమర్షరౌద్ర— వ్రా. ప్ర.

వ. వెండియు నతండు ప్రాకృతకపిరూపధరుం డై నిల్చి రామలక్ష్మణులకు నమస్కరించి యంగదప్లవంగప్రముఖ సేనాపరివృతుం డై మాసమాత్రంబున మరలి వచ్చెద నని చని వనగిరిగుహాప్రదేశంబుల సీత నన్వేషించుచు నతిదూరం బరిగి యొక్కబిలంబు సొచ్చి యందుఁ గనక రత్నమందిరగోపురపరిపూర్ణం బైనపురంబుం గాంచి తన్మధ్యంబున మాయాబలసమన్విత యగునొక్కయో గినిం గాంచి యంత నక్కపు లిప్పురం బెవ్వరి దని యడిగిన నది యిట్లనియె. 187

క. ఘనపుర మింద్రునియది నన్
గాపుంచె నతండు దీనిఁ గడచినవారిన్
శాపాహతులుగఁ జేయుదు
నేపనికిని వచ్చినార లెవ్వరు మీరల్. 188

క. అనవుడు సీతాన్వేషణ
మొనరింపఁగ వచ్చినార మాభూమిని రా
మునిబంటుల మన నయ్యో
గినియుఁ గ్రామునిఁ దలఁచి కేల్మోడ్చి దగన్. 189

చ. ఫలకుసుమాభినమ్రతరు
పంక్తులఁ బొల్చువనాని మత్తకో
కిలకులచంచరీకశుక
కేకిరవాఢ్యమై నదాని ని

త్కలవలదీప్తికాశతప
మంజసతం బొలుపారుదాని స
జ్జలజదళాక్షియాజ్ఞ నొక
సద్వనవాటికిఁ జొచ్చి రాశపుల్. 140

ఉ. తేనియ గ్రోలి సోలి యటఁ
దియ్యనిపండ్ల మెక్కి తేటసి
రాని సుఖోన్నతిం జెలఁగి
యాఁకలియుం దృషయుం దృజించి యు
ద్యానిని వెల్వరింపఁగఁ గ్రొ
మ్మంచున నగ్గుహ నిర్గమించి యం
భోనిధితీర ధారుణికిఁ
బోయి వసించి కపీంద్రు లందఱుం. 141

క. తమలోఁ బలుకుచునుండెడు
సమయంబున నచటఁ దిరుగుసంపాతి యనం
గొమరైనపక్షి సీతా
విమతేప్సిత లంక నున్నవిధ మెఱిఁగించెన్. 142

క. ఎఱిఁగించిన విని వా రం
దఱు నీసాగరము దాఁట దక్షుం డెవ్వాఁ
డెఱిఁగింపుఁ డనిన నంగదుఁ
డఱిసేయక తెలుపఁ దొణఁగె నాత్మబలంబుల్. 143

ఆ. నవతియోజనములు జవగతి లంఘింతు
వటిలుబలిమికలిమి వారిరాశి
యంత విశ్రమించి యవతల నిన్నియు
యోజనములు గడతు నోఁజ మొఱసి. 144

వ. అని పలికిన జాంబవంతుం డిట్లనియె. 145

తే. అమరగిరికిఁ బ్రదక్షిణం బాచరించు
నాఁడు తద్గిరిశిఖరంబు నాఁటుకొనదు
తాఁకితం బయి నాజానుతలమునందు
ఖండితావాప్తి యయ్యెఁ దత్కారణమున. 146

వ. అయినను శతయోజనంబులు లంఘింప నోపుదు మరలి
వచ్చుట సందియం బని పలికిన హనుమంతుం డిట్లనియె.

తే. సప్తజలధులు దాఁటి యక్షణమ వత్తు
నట్టిబంధూలునకు లంక యనఁగ నెంత
యవనిసుతఁ జూచి వేవేగ యరుగుదెంతు
మఱిఁ ద్రికూటాచలం బైనఁ బెఱికి తెత్తు. 148

క. అని లంకాభిముఖుం డై
యనిలజుఁ డనిలగతి నరిగి యంబుధిమధ్యం
బున ఛాయాగ్రాహముఁ ద్రుంచి
జననిఁ సురసాఖ్య గెలిచి చనియెం బెలుచన్. 149

వ. మైనాకగిరిం ద్రింబును మన్నించి కడచి చని లంకాప్రాం

తంబుం జేరి తద్ద్వారపాలిక యగులంకిణి వారించిన దాని
కి ట్లనియె. 150

తే. అల్పబలు వానరుని నేల యడ్డపెట్టె
దేను గనుఁగొన్న యంతన యివ్వరంబు
గాలిపోవునొ వనమెల్ల గాసియగునొ
మడియుదురొ దైత్య లక్షకుమారముఖులు. 151

చ. అని పలుకంగ రక్కసియు
నయ్యనిలాత్మజుఁడిక్కఁ జూచి యి
య్యనఘుఁ డలంతి యయ్యును భ
యంకరశక్తులు పల్కెడిన్ సురల్
వనిచిరొ వీని రాఘవుఁడు
వంచెనొ కాకల నందికేశుఁ డీ
సున శపియింప నిన్నగరి
సొంపు *దహింపఁగఁ జేరికేశుఁడో. 152

క. పలుకులచేఁ దెలియఁగ నగు
కులమును దేజంబు బలము గుణమును ధీమం
తులు వీనిపలుకు సూడఁగఁ
జాలుపడు నీలంక వీనిభుజశక్తి పెంయున్. 153

తే. వీఁడు సామాన్యకీశుండు గాఁ డటంచు
కాలమున శైవ సాతఁ డాకాలమునన

* దరింపఁగ ; కలింపఁగ—వ్రా. ప్ర.

టంగనగన్సిఁ బగిమార్చి లంక సాధ్చి
యుండు సీతామహాదేవి నరయఁదొణఁగె. 154

సీ. పేడునూనాదితంబు లగు
విప్రగృహంబుల గోపురంబులఁ
వీదుల రచ్చకొట్టముల
వీథుల రాజగృహంబులందుఁ బ్రా
**సాదతలంబులం దివిజ**
సద్మములన్ వనసీమలందుఁ గ్రి
**వ్యాదని కేతనంబులను**
నారయుచుం జని యాతఁ డొక్కచోన్.

చ. దివిజవిరోధి జానకిని
దెచ్చుట యాదిగ దుర్నిమిత్తముఁ
గని సిను నేఁట రేపటని
లంక వినాశము నొందు శశ్రిసం
భవు సని గెల్చి రాఘవుఁడు
భానుతనూభవు నేలి భూమిసం
భవ వెదకం గపీశ్వరులఁ
బంపినవాఁడు సహస్రసంఖ్యలన్. 156

**ఉ. వారలలోనఁ జేరువల**
వాఁ డకురాచలసన్నిభాంగుఁ డా

మారుతనందనుండు హను
మంతుఁడు వారిధి దాఁటి యుప్పుర
ద్వారముఁ గాచు దానవి న
వారితశక్తి నడంచి సీతఁ దా
నారయ నంచుఁ బౌరజను
లాడుకొనన్ విని సంతసిల్లుచున్. 157

తే. అనిలజుఁడు దానవేంద్రునియంతిపురము
ప్రాంతఁ జెలువొందు నశోకవనాంతరమున
క్షితితనూభవఁ గని నమస్కృతి యొనర్చి
ముద్రిక యొసంగి విశ్వాసముద్రి దవర. 158

వ. నిజవృత్తం బెల్ల నెఱింగించి సమ్యగంబల్క మదాగమనంబు
రాక్షసులకు నెఱుక గావింపవ నవి యున్నవాఁడు. 159

ఉ. పావని యావనిం జెఱిచి
పాఱఁగఁ బైచి తదీయపాలురం
జావడఁ ద్రుంచి గర్జనము
సేయునెడన్ దారకీడదానవుల్
రావణునమ్ముఖంబునఁ ది
రంబుగఁ దెల్పిన నాతఁ డుల్క యు
క్త్యావిలచిత్తుఁడై పనిచె
నక్షకుమారు నరుత్కుమారుపై. 160

తే. లంకలోఁ గల్గునట్టి బలంబునందు
నాలుగవపాలు గొల్వ నప్పాలసుండు
చక్కటికిఁ జేరఁ దోరణస్తంభమాతుల
గిటకముఁబలె నద్దైత్యు గిటడంచె. 161

తే. ఇట్లు సబలంబుగా వానియొపడంపఁ
గీశవల్లభుపైఁ జాలఁ గినుక వొడమి
తనతనూభవు నింద్రజిద్దనుజుఁ బనిచె
నతనిఁ బట్టంగ రావణుం డుగ్రణంబ. 162

సీ. మేఘనాదుండు సమీరనందనుఁ గాంచి
యితఁడు సామాన్యకపీశ్వరుండొ
క్రియాగ్నికైవడి భాసిల్లుచున్నవాఁ
డని యనేకాస్త్రంబు లడరఁజేయ
నవియు భాస్కరునిపైఁ గవియునీహారక
ణంబులగతి విఫలంబు లైన
నలిగి పద్మజబాణ మడరింప నినతంతు
బద్ధమ్ముగొందరింబుపనిది దానఁ

తే. గట్టువడి వీరభీతుఁ డై కపివరుండు
దానవులు చేర రావణస్థాని కరిగె
[illegible]ము రుద్రాంశసంభవు నతనిఁ గాంచి
[illegible]సంభవుఁ డాగుచు. 163

తే. ఈనిశావేళ లంకకు నేఁగుదెంచి
తేమికారణమున నిన్ను నెవ్వఁ డనిపెఁ
దక్కరుండవు వానర దండనంబు
సేయఁదగుఁగాక నినుఁ గృపసేయ నగునె. 164

వ. అనిన. 165

మ. నిను వాలంబునఁ గట్టి నీరధుల ని
ర్భిద్రస్థితిం ద్రిప్పి యుం
చినశక్రాత్మజు నొక్కబాణమున ను
స్థేమోన్నతిం బట్టు గూ
ల్చిన యారాముని బంట వాయుజుఁడ నే
సీత న్విలోకించితిన్
హనుమంతుం డనువాఁడ నీసుతుని గ
ర్వాంధుఁ జెనం ద్రుంచితిన్. 166

ఉ. హైహయవంశసంజనితుఁ
డర్జునుఁ డాజి జయించె నిన్నుఁ ద
ద్బాహుసహస్రముం దునిమె
భార్గవరాముఁడు దద్భుజాబలో
త్సాహముఁ గుంచె రాఘవుఁడు
దాదృశవిక్రమశాలితో మదన్
సాహసవృత్తి విక్రమము
సల్పెద నెవ్వఁడు గాచు ని న్నిఁకన్. 167

ఉ. జీవిత మిష్టమేనియును
శ్రీరఘురాముని వే భజింపు మే
నీవిధి బుద్ధిదెల్పుటకు
హీనబలుం డగుమేఘనాదుచేఁ
జేవఁ దొలంగి పట్టువడి
చేరితి నాదగుపాణిఘుట్టనన్
దేవగిరిం బగుల్తు నిఁక
దేవవిరోధులు నాకు నడ్డమే. 168

తే. లంక నిశ్శంక నీయచలంబుతోన
పెఱికి రామునిసన్నిధిఁ బెట్టువాఁడ
నేరి రావణ కళ్యాణకోరవాతుల
నీరు పరిశుద్ధిఁ జెందెద విది నిజంబు. 169

చ. అనవుడు దానవాగ్రణి య
హంకరణంబున వీనిఁ బట్టి వే
తునుముఁ డనన్ విభీషణుఁడు
దూతలు వధ్యులు గా రటంచు నే
ర్పున [illegible] నార్లవగ
[illegible] కీలకీలలఁ
[illegible]
[illegible]వంచన్. 170

తే. దానవులు చేలములు చుట్ట వానరేంద్రు
వాల మభివృద్ధిఁ బొంది యవ్వారిలోఁగ
నలరె ముప్పదియోజనంబులపొడవును
వరుసఁ బదియోజనంబులవలముఁ గల్గి. 171

క. అలంకాపురిఁ గల్గిన
చేలము లన్నియును నేతిచేఁ దడుపుచుఁ ద
ద్వాలమునఁ జుట్టి వహ్ని
జ్వాలానందోజనంబు నల్పిరి దనుజుల్. 172

ఉ. అంశుకము ల్హరించి పరిభ
యాపద పౌరులకుం ఘటించుచుం
బ్రాంశుశరీరుఁడై తనదు
బంధము లన్నియుఁ ద్రెవ్వఁజేసి యా
విప్రంశతిబాహుపర్విలు కపి
వీరుఁడు కాల్పఁదొడంగెఁ బూర్ణ
కాంశునిలీల వాలమున
కాశిఖ చల్లఁదనంబుఁ గూర్పఁగన్. 173

చ. నలలితరామపాదజల
జాతము లాత్మఁ దలంచుచుండె స
ద్బలియుని కగ్ని చల్లనయి
భాతిలె శీతలచందనప్రియం

చెలువుగ రామనామసుధ
　　చేకొని త్రావెడువానికిని హాలా
హలవిలయాగ్నిమృత్యువడ
　　నావృతుఁడైనను భీతి గల్గునే. 174

సీ. హనుమంతుఁ డీగతి నాలంక యంతయు
　　హవ్యవాహార్పణం బాచరింపఁ
పౌరజనంబు లాబాలవృద్ధాతుర
　　సహితులై పురబహిఃస్థలి వసించి
కట్టినపుట్ట మొక్కటి దక్క నిఖిలముఁ
　　ఖిలమయ్యె ననుచు దుఃఖించువారు
క్రొవ్వి పోకార్చె నిక్కపి యిట్టి దని
　　నెట్టన శాపంబుఁ బెట్టువారు

తే. నగ్నికిని రామదేవున కనిలజునకు
మొనసి చేదోయి మొగిడించి మ్రొక్కువారు
నైరి యారాత్రి శివరాత్రియంతమున స
ర్వజాగరణక్రియ గదురఁ జేయ. 175

తే. హరుఁడు పురములుమూఁడె నవ్వరి దహించి
కడలి వాలాగ్నిఁ జల్లార్చి కపివరుండు
మహిసుతాదత్త మగుశిరోమణి గ్రహించి
యుదధి లంఘించి హరివీరు లెదురుకొనఁగ. 176

క. వనచరులకు సుగ్రీవుని
వనిఁ జూపుకొనంగి భక్తవత్సలుఁ డగురా
మునిసన్నిధికిం జని కం
టిని సీత నటంచుఁ బల్కెఁ బొందం బలర౯. 177

తే. అట్లు చేసినయుపకృతి కాత్మ మెచ్చి
కపివరుని రామచంద్రుండు కౌఁగిలించి
యాజలధిమధ్యమున శతయోజనంబు
లనఘ యేఁగతి దాఁటితి వనుడు నతఁడు. 178

తే. రామ నీనామ మొకపరి రహిఁ జపించి
బాల్యులైనను భవవార్ధి సంతరింప
భద్రభవదంగుళీయకముద్రికలిమి
యంబునిధి క్రోఁతి గడచుట యద్భుతంబె. 179

క. అని నిజవృత్తాంతంబును
వనధిగభీరతయు లంకవైభవముం బ
య్యన విన్నవించుటయు న
య్యనఘుఁడు లంకపయిఁ జనఁగ నత్యుత్సుకుఁడై. 180

తే. అంగదుని నెక్కి లక్ష్మణుం డరుగుదేర
దాను మారుతిపై నెక్కి తరతరంబ
సకలవానరయూథపసమితి గొలువ
నరిగి మలయాద్రియును సహ్యగిరియుఁ గడచి. 181

మహాస్రగ్ధర.
కనియెం భూపాలుఁ డంతన్
ఘనతరముదితాఖండకూలంకషాలిం
గనమూర్ధ్వధ్వంగబాహా
ర్గళదళితలసత్కంకణోన్నిద్రముద్రన్
స్వనితాంతస్వానలీలా
కమితపృథుదిశాసామజాత్యుద్రినిద్రన్
జనతాతత్తాతిదత్తా
సమదినమణిరుక్సాంద్రభద్రున్ సముద్రున్.

తే. అనసముద్రవేలాతటం బధివసించె
వానరబలంబు రెండవవార్ధివోలె
రాజధర్మక్రమంబుఁ బురస్కరించి
యుదధిఁ బ్రార్థించె నపుడు రఘూద్వహుండు. 183

ఉ. రంగదభంగభంగరవ
రాజితమై చెలరేఁగి నింగికిం
బొంగుచునుండెఁ గాని రఘు
పుంగవునిన్ గణియింప దయ్యె న
న్నాంగలివార్థి యట్లు పృథి
విన్ సుజనున్ హసియించుచున్ నిజా
మంగళవైభవంబె పలు
మాఱును జూపు జడాత్ముఁ డుద్ధతిన్. 184

క. సేఁగువు శ్రీశైలము ఋ
భ్యాద్రి స్థిలాచలంబుఁ గాశిక్షేత్రం సం
ప్రీతిన్ సందర్శించిన
పూతమతికి వాంఛితార్థములు సిద్ధించున్. 189

తే. అన్నఁ దొలఁగి విభీషణుం డన్న రెండ్రి
శరణము భజించె నాలోన శరధి దాటి
యద్రిసమధీరుఁ డై సువేలాద్రి యెక్కి
లంక వీక్షించె వీతశలంకుఁ *డతఁడు. 190

వ. రావణుండును సౌక్రమహో త్సేధసౌధం బారోహించి
వానరవాహినిం గాంచి రామదేవుని గుఱుతుగాఁ గొఱుర
గం దలంచి శుకసారణు లనుచారణులం బనిచిన వారలు
సేనాసాగరంబుం బ్రవేశించి యరసి వచ్చి యి ట్లనిరి. 191

సీ. అచ్ఛభల్లాధీశుఁ డగుజాంబవంతుండు
వేల క్షేత్రము పూని వెలసె నిల్చె
ననిలపుత్రాంగదు లంకేశ్రిజాన్వయు
లేదిక్కులందు నిలిచి కొలువ
నినజుండు సౌమిత్రియును సంగతి భుజించి
ప్రోత్ఫుఁ గార్యము విన్నపంబు సేయ
సంశుకసంభాదితాస్యుఁ డై చెవిదండ
యసవిభీషణుఁడు మంతనము చెలువఁ

తే. కూటమున మృగశృఙ్గపైఁ గూరుచున్న
యసితవర్ణుఁ డాజానుబాహార్గళుండు
రాముఁ డతఁడు రాక్షసరాజవర్య
వాసిమై నిర్వదేసెండ్లవయసువాఁడు. 192

క. ఘోరాకారులు వానర
వీరులు గోటానకోట్లు చుట్టుం గొలువన్
మేరుధరాధరధీరుం
డారాముఁడు నిన్ను గెలువ నరుదెంచె వెసన్. 193

వ. ఇందులకుఁ బ్రతివిధానం బాచరింపు మని తెల్పునవస
రంబున. 194

తే. ఆ సువేలాద్రిపై నుండి యార్కసూనుఁ
డెగసి వచ్చి రావణునిపైఁ గల్గి విఱిచి
ముష్టిఘాతాహతుల నొంచి మురువడంచి
చనియె వెండియు రామునిసన్నిధికిని. 195

వ. ఆసమయంబున రావణుండు పురప్రాకారరక్షణార్థంబునే
క దైత్యదానవవీరుల నియోగించి తాను ససేనాక్షౌహిణీ
మూలబలసమేతంబుగా యుద్ధంబునకు నిర్గమించె సద్దా
నవుల నెదుర్కొని వానరవీరు లత్యంతదారుణం బైసర
ణంబు సేయుందొడంగి రందు దశగ్రీవు రాఘవుండును,
మేఘనాదుని లక్ష్మణుండును, ప్రహస్తుని సుగ్రీవుండును,
మహాకాయుని జాంబవంతుండును, అతికాయుని శరభుం

డును, మఱియు ననేకు లనేకులతోఁ దోడరి ద్వంద్వ
యుద్ధం బొనరింప నంత రామబాణపీడితుం డై భిన్నశ
రాసనుండును, నిరాశారంభుండును నై రావణుండు
మరలి లంకకుం బఱచె జనకునిపలాయనంబుఁ గాంచి
మేఘనాదుం డత్యంతక్రోధంబునం గపిబలంబుల నెల్ల
నమయించి సౌమిత్రియుం దానును పోరొనరించుచు
నుండి యంత. 196

ఉ. ఆయుధధైర్యధుర్యునిశి
తాశుగవేగము సైపలేక నై
పోయనవీథి నిల్చి కపి
నాథుల గీటణఁగించి మించి య
చ్ఛాయకుఁ జేరి రాఘవుల
ఘోరశరాహతి నాత్మమాయలం
బాయఁగఁ జేసి ఘోరఫణి
పాశనిబద్ధులఁ జేసి వారలన్. 197

ఉ. ఈనెటి రాములక్ష్మణుల
నిద్దఱి గాసి యొనర్చి లంకకున్
దానవనందనుం డరిగి
తద్విజయప్రద మైనహోమముం
బూని యొనర్ప నంత రఘు
పుంగవు లున్నతెఱంగుఁ గాంచి యా

ణ్యాసరు లెల్లఁ జింతిలఁగ
వారలపాలి విద్యుతంబుగఁగా. 198

తే. నారదుఁడు వచ్చి యారఘువీరుతోడ
స్వామి నీవాహనం బైన వైనతేయుఁ
దలఁపు మన నట్ల తలఁచినఁ దార్క్ష్యుఁ డరుగు
దెంచి పన్నగబంధముల్ దీలుపఱిచె. 199

క. అవినతాసుతుఁ డహిబం
ధావళి వో మీఁటి వైవ నాశాఖామరుల్
పావనిచే సంజీవితు
లై వెలసినకపులు గొలువ నలరిరి గడిమిన్. 200

శా. అంతన్ వేలిమి దీర్చి రావణి కరాం
గారూఢుఁ డై వచ్చి దు
ర్దాంతానంతబలాఢ్యు లక్ష్మణు నమ
ద్యత్లో[illegible]ధుఁ డై శాఁత క
ల్పాంతాగ్నిస్ఫుటసాయకప్రతతు లే
తన్ వాని వారించి వి
శ్రాంతిం [illegible] వాజులన్ శరలను
[illegible] సాధించె రౌద్రియున్. 201

[illegible] డై వా[illegible] ంతరు తేగ మరిగి
[illegible] కుంభ[illegible]బందవలిల

సమర మొనరించె దాను లక్ష్మణుఁ డపుడు
వృత్రవాసవు లని సేయువిధము దోఁప. 202

(వ. పోరొనరింపం దొడంగి రంత.) 203

మ. శరసంధానము మోక్షణంబు యుగప
త్సంప్రాప్తిఁ జెన్నొంద నా
హరిశౌర్యుండు సుమిత్రపట్టి యని సే
యం గాంచి యాద్భుతమహా
శరవేగంబు సుపర్వసంతతికి ర
క్షఃశ్రేణికిం గల్గ దీ
యురుతేజం గెలువంగఁ బోల దని తా
నూహించి వాఁ డత్తఱిన్. 204

క. సురవరులు నసురయోధులు
హరివీరులు గనఁగ రఘుపానుజు నెమ్మై
శరవృష్టిన్ ముంచిన న
య్యురుభుజుఁ డజశరము వింట యోజించి వెసన్. 205

తే. అనఘుఁ డీరాముఁడు పరాత్ముఁ డయ్యె నేని
యవని మాతల్లి తా సాధ్వి యయ్యె నేని
దశరథున కేను సుతుఁడ నై తగుదు నేని
ద్రుహిణసాయక మీదైత్యుఁ దునుముఁగాక. 206

చ. అని తెగ వాపఁ దత్ప్రదర
మా దనుజుం దెగటార్చి పేర్చి నా

ఘనుపయిఁ బుష్పవర్ష మతి
గాఢముగా గురియించి దేవతల్
వినుతి యొనర్చి రంతఁ గపి
వీరులు నృత్యము సల్ప మేఘనా
దునినిధనంబు దానవులు
దోడన తెల్పిరి దైత్యభర్తకున్. 207

ఆ. అతఁడు క్రోధదీప్తుఁ డై కుంభకర్ణునిఁ
బనిచె రాముతోడ నని యొనర్ప
సమ్మహోన్నతాంగుఁ డప్పురవరణంబు
గడప దాఁటుమాడ్కిఁ గడచి చనియె. 208

శా. ఆరక్తోపరుషఘోరకాయము ప్లవం
గానీక మ్మీక్షించి య
మ్మేరుగ్రావము మందరంబొ యటు
లిమ్ముఁ దాల్చి శిలావళుల్
సారోదారత నొంప వచ్చె నని దు
స్సారవ్యథం గుంది దు
ర్వారాహంకృతి వానిమీఁదఁ దరులుం
గ్రావంబులున్ వైచినన్. 209

చ. వనచరహస్తముక్తతరు
ప్రాకరములుం ధరణీధరంబులుం

పెనుపెల్లుపై సడంగుజల
బిందులచందము నొంది వండె న
ద్దనుజానురంబుఁ దాఁకి యట
తత్కపివీరుల మిన్నిఁగఁజొచ్చె వాఁ
డనువుగ నిత్తుఖండములు
వ్రాలి మొసంగుగజేంద్రుకై వడిన్. 210

తే. జాలికుఁడు జాలముల మీనసమితిఁబోలె
హస్తములఁ బట్టి వదనగుహాంతరమునఁ
జొనుప సద్దైత్యునాసికాశ్రుతిబిలముల
వెడలి వచ్చిరి గొందఱు వృత్తచరులు. 211

క. సుగ్రీవముక్తభూమిరు
హాగ్రావనిపాతజర్జరాంగుం డై వాఁ
డుగ్రత గదఁ గొని వైచెన్
సుగ్రీవుఁడు మూర్ఛచే వసుంధర వ్రాలన్. 212

క. ఇనజునిఁ దనభుజమున నిడి
కొని దైత్యుం డరిగె లంకకుం జెచ్చెర న
వ్వనచరపతిచందముఁ గని
హనుమత్ప్రముఖులు గలంక నందుచుఁ దమలోన్. 213

...న శక్తుఁ డనను
...ల త్వరితంబున మానశాలి యా

వసధు నే నిజశోణితం బానుకతన
నౌరుల నాత్మీయుల నెఱుంగ కున్నవాఁడ. 216

తే. అనుచుఁ బల్కు విభీషణుం డట్లు తొలఁగ
నంత నద్దైత్యుపై రాముఁ డంపవాన
గురిసె శైలంబుపై వానగురియులీల
నది యతనిమేన రోమంబులట్ల యమరె. 217

మ. కదనం బీగతిఁ జెల్ల రాఘవుఁడు దో
ర్గర్వం బఖర్వంబుగా
గదఁ బారించుచు నేఁగుదేరఁ గని యా
క్రవ్యాదుచేదోయియుం
బదయుగ్మంబును గంఠము న్నఱికె శుం
భద్బాణధారాహతిం
ద్రిదశు ల్విస్మితచిత్తులై నిలిచి సం
ప్రీతిం బ్రశంసింపఁగన్. 218

ఆ. ఇట్లు కుంభకర్ణుఁ డీల్గిన హతశేష
బలములోడఁ దాన బవరమునకుఁ
జనియె నాపదబ్ధి మునిఁగియు ధైర్యంబు
[illegible] బం క్తికంధరుండు. 219

[illegible]విలసితము.
[illegible]లును [illegible] [illegible]చరవీరుల్
[illegible] చేయుం

ఖరపరశువులును *(గదలును) గాంగ
త్కరములుఁ బఱపిరి గడగుచువారల్. ౨౨౦

క. ఈరీతి నుభయబలములుఁ
బోరాడఁగఁ దనకు నెదురుపోలదిండిపయిం
ధీరత రామమహీపతి
మారుతిపై నెక్కి పఱపె మార్గణవితతుల్. ౨౨౧

తే. రామకార్ముకముక్తనారాచసమితి
నిటలమున నాఁటి మూర్ఛిల్లె నిర్జరారి
యల్లి సారథి యరదంబుఁ ద్రోలఁగఁ జేయ
నంతఁ దెలివొంది కినుక నిట్లనుచుఁ బలికె. ౨౨౨

క. ఓరీ నను ధీరునిఁగ వి
చారించి రథంబు దేరఁ జనునే నీకుఁ
వైరులు గని నవ్వఁగ దు
శ్చారిత్రక యపయశంబు సంధించితిగా! ౨౨౩

తే. అనుచుఁ గ్రోధించి వాఁడు నద్దనుజుఁ గాంచి
దేవ యిది సూతకృత్యంబు దీని కలుగ
నగునె రాముని గెలువు మీ వనుచుఁ (బలికె)
నట్లు సన్నద్ధుఁ డై యతఁ డనికి నడరె. ౨౨౪

క. వృషచరవీరు లాలో
వృక్షంబుల శైలములను వివిధాస్త్రములన్

* [illegible] కవచము [illegible]

రక్షోబలములఁ గడచిన
వీక్షించి యతండు రోషవివశుం డగుచున్ 225

ఉ. రాముని నెదిర్చి ఘోరశర
రాజి నిగుడ్చిన నాతఁ డల్గి యు
ద్దామగతిం దదశ్వములఁ
దద్రథసూతుఁ దదీయచాపమున్
భీమశరంబులం దునిమి
పెల్లుగ *సాయకవృష్టి ముంప న
గ్గామిడిరక్కసుండు భయ
కంపితుఁ డై పఱచెన్ రయంబునన్. 226

వ. ఇట్లు రామబాణకృతవేదన సహింపలేక రణంబు విడిచి
లంకాపురంబునకుం బఱచుచు నారాముండు. 227

మ. కులశైలోపవనావనీరుహలతా
కుంజంబులన్ ఖేయసం
స్థల సాలాంతరసీమలన్ మఱి బహి
ర్ద్వారంబులన్ లంకలోఁ
గలసౌధంబుల వీథులన్ నిజగృహా
గారంబులన్ రాము ను
జ్జ్వలబాణాంచితచాపపాణిఁ గనితో
నంతర్నిస్త్రభావంబునన్. 228

*. సాయక—బాణ. ప్రి.

మ. పరిశయుంభోదనినాదమేదురధను
ర్జ్యాటంకృతుల్ మీఱ ను
జ్జ్వలకాండంబులు పెల్లుగాఁ గురియుచుం
బాఱొంది రక్షాంతప
*ర్వలసన్లోచనుఁడై పురంబు లలుకన్
మర్దించు శంభుండు నాఁ
†జెలు వా రామునిఁ బంక్తికంధరుఁడు గాం
చెన్ సర్వదిగ్భిత్తులన్. 229

క. జగమంతయు రామాత్మక
ముగఁ గని రావణుఁడు దీర్ఘముగ రోఁజె సభన్
బొగడొందుచుఁ గల గని భయ
ము గదుర నరునిగతి మిగుల మోహాతురుఁడై. 230

క. తరుణులును సభాసదులును
గర మాశ్చర్యంబు నొందఁ గడు భీతుండై
దురితతరుఁ డైనదనుజుఁడు
పొరి నుబ్బుఁ దొలంగి వగలఁ బొగులుచు నుండెన్. 231

వ. అంత నారాఘవుండు నిజవిశ్వరూపంబు చాలించుటు గా
వించినం బ్రకృతిస్థుం డై రావణుండు లజ్జావనతుండును
మందోదరీసమేతుండును నై యంతఃపురంబున కేఁగి
చింతించుచుండె నంత. 232

* పర్వ; † జెలఁగుం రామునిఁ—పా. భే.

సీ. అపుడు రాముని యాన నగచరవరు లశో
*కారామమున నున్న యవనిజాతఁ
దోడ్తెర నాఁ బత్త్రయ్యలిఁ గనుఁగొని
ప్రత్యయం బొనరింపఁ బనుప నదియు
సీతాంగనాకృతిచే లంకఁ జొచ్చితి
నే మృత్యుదేవత నిక్క మరయ
నేమహామహానిమాయామహాబ్ధి మునింగి
పారంబుఁ గనలేరు పద్మజాదు

తే. లట్టి రామునిచేఁ బరమాత్మచేత
ననుపమప్రీతి నాకార్య మయ్యె ననుచు
సకలలోకంబులు వినంగఁ జాటిచెప్పి
చనియె మృత్యువు తనరూపు సవరించి. 251

తే. సకల దైవతవిమతుల సంహరించి
సమరహతు లైనకాననచరుల మనిచి
యసనుతవిభీషణాదిసమేతుఁ డగుచు
నపుడు రాముఁ డయోధ్యకు నరుగఁ దలఁచి. 252

క. నిజసీతాసంగతుఁ డై
యజరులు [illegible] బుష్పకాధిరూఢుం డై [illegible]
ప్రజవగతి నరిగెఁ బ్లవగ [illegible]
ధ్వజినీసముదయము [illegible] 253

* కారామమున నున్న [illegible]

తే. కామగమ మైన యాపుష్పకము రయమున
సరగఁ గిష్కింధఁ జేరఁ దారాదివనచ
రాంగనల నందు నెక్కించి యర్థిఁ జనఁగఁ
జని యతండు భరద్వాజమునికి మ్రొక్కి. 254

క. నందిగ్రామమునకుఁ జని
క్రమ్మఱ భరతాదిసహితుఁ డై నిబిడజటా
బృందము విడిచి యమందా
నందమతిం జెలఁగుచు రఘునందనుఁ డంతన్. 255

సీ. సమలంకృతం బయి సంతుష్టరాజన
వాన్వితం బగునయోధ్యాపురంబు
మహిమఁ బ్రవేశించి మణిమయసింహాస
నారూఢుఁ డై యమాత్యానుమతిని
బట్టాభిషిక్తుఁ డై భరతశత్రుఘ్నుల
క్ష్మణధరానందనాసహితుఁ డగుచు
నిలఁ బదునొకొండువేలేఁడులు నిష్కంట
కంబుగా నేలి భోగములఁ దనిసి

తే. వివిధసుఖములు పెక్కు గావించి సుతుల
రాజ్యమున నిల్పి సద్ధర్మరతి నెలంగ
వెనుక నాసన్నిధికి వచ్చు వినుతకీర్తి
రామచంద్రుండు సుగుణాభిరాముఁ డగుచు. 256

వ. అని చెప్పి యీశ్వరుఁడు. 257

గీ. మన్మథోత్పత్తి యైన యీమహితదివ్య
కథ పఠించిన శుభములు గలుగుఁ గలుష
వితతు *లఱు నాతఁ డప్సరోవితతి గొలువ
నంతమున మహేంద్రంబున నధివసించు. 258

ఆ. వేదసమ్మతము పవిత్రంబు దురితఘ్న
మైనరామచరిత మనఘమూర్తి
వామలూరుభవుఁడు వాల్మీకి యనుముని
రచనసేయఁగలఁడు ప్రియమరయఁగ. 259

తే. అతఁడు మును పుళిందుఁ డయ్యు వసిష్ఠోప
దేశమునఁ జెలంగి ద్విజతఁ గాంచి
యాదికవి యనంగ నలరు మహామహి
పుట్టలోనఁ బుట్టు భూనుతముగ. 260

వ. అని యానతిచ్చి శివాసమేతుం డై శివుండు నిజధామం
బు ప్రవేశించె నిక్కథ నద్దేవునివలన నాకర్ణించితి నని
చెప్పి నారదుండు వసిష్ఠాదుల కిట్లనియె. 261

క. మును నే వాల్మీకాంతిక
మునఁ జరియించుచును వింటి మునులారా రా
మునినాథు డిపుడు మీరున్
ఘనగతి వింటి రది యరయఁగాఁ దగు నిచటన్. 262

వ. అనిన వసిష్ఠాదు లిట్లనిరి. 263

* లఱు—వ్రా. ప్రతి.

క. శివరాములచారిత్రము
దివిజముని శ్రేష్ఠ నీవు దెల్పఁగ వినుటన్
భవములు సఫలతఁ జెందెన్
శ్రవణానందంబు మాకు సంధిల్లఁ గడున్. 264

వ. అని యుగ్రసేనమునిం బూజించి యతండును దారును ఖనిత్రప్రముఖసాధనంబులు గొని వల్మీకప్రాంతంబునకు నరిగి చిరకాలావృతం బైన యప్పుట్టం గ్రొద్ది యందు. 265

సీ. స్ఫుటపుష్కరశోభితభూరిప్రభాసాంద్ర
సరసనవల్కలనిచయావృతాంగుఁ
బాటలస్ఫుటజటాపటలాలిశోభితు
రామనామాసక్తరమ్యరసను
సద్గురువరపాదజలజార్చితేచ్ఛు
దీప్యమానానలదివ్యతేజు
నవిదితబాహ్యలోకానీకవర్తను
శ్రీరామచరణాబ్జచింతనాత్ము

తే. బద్ధపద్మాసనస్థుఁ దపఃప్రదీప్తు
మునివరు నొకనిఁ గాంచి యమ్మనుజులు వివిధ
విధుల బోధించి విసివి రాద్విజుఁడు వారి
పలుకు వినఁ దయ్యె నిశ్చలభావమునను. 266

క. ఋషిరసనాగ్రంబున
భారతి నటియింప మధురభణితి నితండు దా
శ్రీరామాయణదివ్యక
థారచన యొనర్చు సుకవితానిధి యగుచున్. 280

ఆ. వేదవేద్యుఁ డైన విష్ణుండ నేను శ్రీ
రామరూపమునఁ గరం బలరఁగ
వసుధ వేద మితనివదనాంబుజమున రా
మాయణాఖ్యచేత నవతరించు. 281

వ. రామాయణశ్రవణపఠనంబు లాచరించినమానవుండు బ్ర
హ్మహత్యాదిసకలపాపనిర్ముక్తుం డై చంద్రునిచందంబు
నొంది జీవన్ముక్తుం డగు నెందియు నిమ్మునీంద్రుఁ డీ
సకలలోకసంచరణపాటవంబు గలుగు నని వరం బొసంగె
నంత నతని వాల్మీకిమహాముని యని యందఱుం గొని
యాడి రిట్లు లబ్ధవరుం డైన యావాల్మీకి యవ్విష్ణుదేవుని
నిట్లని స్తుతియించె. 282

క. విశ్వాత్మ విశ్వరూపక
శశ్వద్వైకుంఠనిలయ చక్రధర విహం
గేశ్వరతురంగ శశివా
ధీశ్వేశుఁ డని యొనర్తు నచ్యుత నిన్నున్. 283

చే లోకాళి న్నిల్పుదు వేడ్కఁ గా

నవవారిదవర్ణ జనార్దన స

న్నవ్యాంభోజాక్ష ఖగవాహా. 286

గీ. నీ కనంతరూపంబులు నివ్విటిల్లు

నైన రామరూపమున నాకూర్మి కుండు

మునుల వెలసిల్లుదువు నీదు మృదుపదములు

గంటి నాకోర్కె ఫలియించె నంటి నధిప. 287

సీ. దశరథనందన తాటకామర్దన

సవపాల మునిసతిశాపభంగ

భవచాపఖండన భార్గవమదహార

ఖరవిరాధాదిరాక్షసవిదార

వాలివిమర్దన వనజాప్తసుతపాల

సింధుబంధన కుంభకర్ణహరణ

పంక్తికంధరదర్పభారభంజన విభీ

షణరాజ్యదాయక సానుసేవ్య

భూసుతాయుక్త సాకేతపురనివాస

యమలిసన్స్వర్ణసింహాసనాధిరూఢ

పారిజ్యసామ్రాజ్యధౌరేయ రామభద్ర

నీకు వేవందనంబులు నిష్కళంక. 288

అరవిందజముఖుల కగో

చర మగు సిరి గల్గ నున్నదేవుడును యు

క. శ్వేతద్వీపంబున బద
రీతరుషండమున మానిహృదయములన్ వి
ఖ్యాతిగ క్షీరోదంబున
నాతత వైకుంఠనగరి నలరుదు పీశా. 294

వ. అని యిట్లు వివిధవిధుల నొనరించుస్తోత్రంబు లంగీక
రించి యవ్వాల్మీకిమహామునికి వెండియు ననేకవరంబు
లొసంగి యద్దేవుండు దేవగణసమేతుండై నిజధామంబు
ప్రవేశించె నంత. 295

క. ధీరుండగువాల్మీకియు
గౌరవ మొప్పార రామకథ యఖిలంబున్
నారదమునివలన న్విని
శ్రీరామాయణ మొనర్చెఁ జిత్రఫణితులన్. 296

వ. అని చెప్పి సూతుండు రామనామప్రభావంబు నాకుఁ
దోఁచినకరణి వర్ణించితి నని వెండియు శౌనకాదులం
జూచి. 297

చ. కొమరుగ రామనామ మొక
కోటి జపించిన మానవుండు బా
సమరఁగ రాఘవుండె యగు
నం దొకలక్ష జపించు చంత భూ
మ్యమరుల దక్షిణం దనిపి
యన్న మొసంగఁదగున్ మహామతిం

గ్రమమున జాపకుండు భవ
శరధిఁ దరించు వరించు సంపదల్. 798

సీ. ప్రథమకోటి జపించిన బ్రహ్మసదన
మంత రెండవకోటిచే హరనివాస
మట్లు మూఁడవకోటిచే నబ్జనాభ
పదముఁ గను రామనామజాపకుఁడు నియతి. 799

వ. యావజ్జీవజాపకుల కైనను సంఖ్యానియమంబు లేక
శుభంబు నొందదు మఱియును. 800

మ. శివనామంబు త్రికోటిజాపకునకుం
జేకూర్చుఁ దల్లోక మా
శివరామాఖ్య త్రికోటిజాపకునకుం
శ్రీశాభ్రికేశాత్మతా
దివిశేషంబులఁ జేర్చు వెండి భగవ
ద్గీతాజపాసక్తుఁడుం
శివగీతాపఠనాపరుండును సుఖ
శ్రీ దాఁటు జన్మాంబుధిన్. 801

వ. మఱియు శివవిష్ణుసహస్రనామంబులును, దేవీమాహా
త్మ్యంబును సంతతంబును జపియించువాఁడు జీవన్ముక్తుం
డగు నని చెప్పిన విని శౌనకాదులు భగవద్గీతామహత్వ
ప్రభావం బెఱింగింపు మని యడిగిన సూతుం డిట్లనియె. 801

సీ. మున్ను యుగాంతరంబునఁ గాలమందరయే
లను భూసురాత్మజు లనఘచరితు
లన్యోన్యహితమిత్రు లఖిలధర్మజ్ఞులు
తీర్థయాత్రికు లేఁగి ధృతి సశేష
పుణ్యాపగాస్నానపూతాంగులై యిటుక
యగ్రహారపుణ్యస్థలయుమున
నవ్విప్రుచేతఁ గృ*తాతిథ్యులై తప
యాలయవేదిక నధివసించి
గీ. దేశకాలపరిసంగంబు దిగిచి యందుఁ
దగఁ బరస్పరమును వివాదంబు సల్పి
శ్రాంత మిడుకొని పైశాచరూపధారు
లై వసించిరి యొకరావి నాశ్రయించి. 303
వ. అంతం గొంతకాలం బరిగిన యనంతరంబ వారలజనకులు పుత్రాన్వేషణతత్పరులై పెక్కుదేశంబులు గుమ్మరి జాడ లరయుచు నయ్యగ్రహారంబు చేరి యతిథిపూజాపరుం డగు నవ్విప్రునింట నాతిథ్యంబు గొని వితర్దికాతలంబునం గూర్చుండి రయ్యవసరంబునఁ బ్రసంగవశంబున నవ్విప్రుండు వారల కిట్లనియె. 303
చ. ఇననిభతేజులైన యొక
యిద్దఱు భూసురు లేఁగుదెంచి ప్రా

* తా.పి.మ్యు. 2— వ్రా. బ్రి.

మునుకుల సత్ప్రసంగమున
మిన్నక పో లొనరించి రోషముల్
పెనఁగొన శాపతప్తు లయి
పిప్పలవృక్షము నాశ్రయించినా
రెనయఁ బిశాచవేషముల
నెచ్చటివారలొ యమ్మహామహాల్. 804

గీ. అనిన వారు నిజాత్మజు లగుట దప్ప
దనుచు నిశ్చయ మొనరించి యెఱుఁగుటకొంచి
యుగ్రతప మాచరింప నవ్యగ్రలీల
నతఁడు ప్రత్యక్షమై వరం బడుగుఁ డనుడు. 805

వ. నిజపుత్త్రుల నొసంగు మనుటయు సంభోజసంభవుం డి
ట్లనియె. 806

ఉ. వటతరుమూలవాసి యగు
వాఁ డొకశూద్రుఁ డవంతి యను పురిఁ
జటి యవధూతవేషమున
సంచరణం బొనరించు వానికిం
బటుతరశిష్యసంచయము
పంచశతంబు సెలంగు నమ్మహా
నటనముఁ జేఁగుజేర నిజ
నందనలాభము గల్గు మీ కిలన్. 807

వ. వాని నశ్వత్థతరుప్రాంతంబునకుం దెచ్చుయత్నం బొన

రింపుఁ డని బ్రహ్మ చనిన వారలు నట్ల యజ్ఞగుని
పురంబున కేఁగి యిక్క యరసి యస్థిమాలికాధరుం
డైన యాయవధూతం గాంచి చిరకాలంబు ప్రార్థించి
తమయింటం గుడువ రమ్మని తోడితెచ్చి యక్కుంజ
రాశనభూజంబు సమీపంబున నిల్చిన. 308

క. వానిఁ గనుమాత్ర భూసుర
సూనులు నిజరుచిరరూపశోభితు లగుచుం
బూన చనుదెంచి యనిశ మ
హానందాంబునిధిఁ దేలి ప్రాంజలు లగుచున్. 309

ఆ. అనఘ నీదర్శనము సేయు నంతమాత్ర
శాపము దొలంగి విగతపిశాచవిగ్ర
హతఁ జెలంగుచు జన్మదేహములు దాల్చి
యరుగుదెంచితి మేము మహానుభావ.

వ. అనిన నజ్జటాధరుం డత్యంతవిస్మితుండై వారలం జూచి.

సీ. స్నానసంధ్యావిహీనుఁడ మేన భసిత
మలఁది చరియింతు నేను శూద్రాన్వయుండ
మీపిశాచాంగములు పోవ మీకు[illegible]శక్తి
యెట్టిమహిమంబుచే నాకు నెలసెఁ జెప్పుఁడ. 311

గీ. అనుడు వారిజనకు లజ్ఞానాజ్ఞచే నిన్నుఁ
దేరవలసె నొండు తెలుఁగు గాము

జండదీధితి జగముల బెండువఱుప
నిండె వేసవి పాంథులగుండె లగల. 331

వ. అక్కాలంబున. 332

క. బహుళాతపోష్మభీతిం
మహిసురుఁడు నదీతటమునను మహీయుగతిం
స్నుహివృక్షద్వయికుఱుఁగట
నహరహము జదువుకొనుఁ దదధ్యాయంబుల్. 333

వ. ఇట్లు నదువుచునుండఁ దత్పాఠశ్రవణప్రభావంబున నావృ
క్షంబులు సంత్యక్తదురితంబులై రాజకులంబున రాజులై
జనియించి సర్వలక్షణలక్షితులును, జాతిస్మరణసంపన్ను
లు నై రాజ్యంబు సేయుచు (శ్రీమద్భగవద్గీతామృత
గతాధ్యాయద్వయనిరంతరపఠనుండును) విష్ణుశర్మానుం
డును నగు నవ్విప్రపుంగవుం గాంచి నమస్కరించి యిట్లనిరి.

ఉ. ఓ ధరణీసురాన్వయవ
రోమనిధిపూర్ణసుధామయూఖ నీ
వీధరఁ బూజనీయుఁడవ
హీనగుణాఢ్యుఁడవిద్ధబుద్ధి మున్
మాధవమాసవేళ గిరి
మా స్నుహివృక్షయుగంబునీడ నీ
వోధను విశ్వరూపము వి
భూతియు నీవు పఠింప విన్నవున్. 325

గీ. మును దదధ్యాయయుగళంబు వినుటఁజేసి
జెముడుమ్రాఁకులు రెండుఁ బాపము దొఱంగి
భవ్యభూతివివేకసంపదఁ జెలంగి
యవనివిభులై జనించి ధరామరేంద్ర. 327

క. ఆమ్మహీభుజులము మేమే
చుమ్మీ వితరణగుణంబు శూరత యశముం
గొమ్మలుఁ గరితురగమ్ములు
నిమ్మగుసంపదలుఁ గలిగె నిదె నీకరుణన్. 328

గీ. స్వామి జాతిస్మృతియు మాకు సంఘటిల్లె
ప్రాప్తరాజ్యులమై ధర్మరతిఁ జెలంగి
యుద్ధభోగావళియు సంగ్రహింపఁ గంటి
మిన్నిపుణ్యంబులకు నీవె హేతు వరయ. 329

క. అని యతని సబాంధవముగఁ
గొని చని తమధరకు నరిగి గురుతరభక్తిన్
మన మలరఁ బూజఁ దనుపుచు
నొనరఁగ సుఖవంతు లగుచు నుండిరి వరుసన్. 330

వ. అని చెప్పి సూతుండు. 331

క. గాయత్రియు మఱి రుద్రా
ధ్యాయముఁ జండీస్తవంబు హరిహరగీతా
ధ్యాయంబు లొకటి కొకటియు
సాయుజ్యం బొసఁగు నిరతజపశీలునకున్. 332

వ. వాల్మీకిచరిత్రం బయిన యీపుణ్యాఖ్యానంబు వేదవ్యాస
విరచితంబు మీకు సవిస్తరంబుగా నెఱింగించితి దీనిని
శ్రద్ధాభక్తిసమన్వితులై పఠించువారలు వినువారలును
విప్రహత్యాదికల్మషంబులం దొలంగి సకలకామంబు
లం బొంది శతవర్షంబులు జీవింతురు. 333

సీ. హరిహరామేయమహత్త్వశోభితమును
సకలధర్మవితానసంగ్రహంబు
సర్వవేదమయంబు సర్వోపనిషదాత్మ
కము నగు నీధర్మఖండ మర్థి.
సర్థార్థులకు నిఖిలార్థప్రదంబును
పుత్రకాములకు సుపుత్రదంబు
నాయుష్యకరముఁ బుణ్యాస్పదంబును యశ
స్కరముఁ జతుర్వర్గసాధనంబు
ఘోరసంసారసాగరతారకంబు
నగు నిరంతరభక్తిసమంచితముగ
వినిన చదివిన వ్రాసిన మనుజులకును
బ్రహ్మవిదులార యిది వ్యాసభాషితంబు. 334

గీ. పొత్తమున వ్రాసి యిక్కథ పూజసేయు
సద్మయంబున వర్ధిల్లు సచలభూతి
యఖిలతీర్థాస్పదంబు శుభాకరంబు
నగుచు విలసిల్లు నద్దేహ మనఘులార. 335

గీ. అవని నధ్యాయ మైనఁ దదర్థ మైన
నందు శ్లోకార్ధమయినఁ దదర్ధ మైన
హాళిఁ జదివిన రాజసూయాశ్వమేధ
ఫలము గలిగించు స్కాందంబు పాఠకులకును. 886

శా. దేవా నీకరుణాకటాక్షమున ను
ద్దీపించు విద్వన్నుత
శ్రీవాగ్వైఖరి ధర్మఖండ మను నీ
చిత్రప్రబంధంబు నా
భావప్రౌఢిని గద్యపద్యములచేఁ
బాటించి యర్పించితిన్
శ్రీవాల్లభ్యమునం గ్రహింపు మిలమిన్
శ్రీశైలమల్లేశ్వరా. 887

శా. గంగాతుంగతరంగసంగతదళ
త్కంజభ్రమన్మత్తసా
రంగీగానవిలోలకర్ణయుగళీ
రంగద్విలాసాత్త త
ద్గంగామంగళదూతికాభ్రమనమా
తంగప్రభాత్మీయవా
మాంగాదీంద్రసులోపలాలనపరా
హారీకృతాహీశ్వరా. 888

* కంజాతమన్మత్త; ♦ రంగద్విలాసంత; ‡ దీంద్ర—పా. ప్ర.

క. పత్త్రీకృతమాహాప్రియు
పత్త్రివిభువాహ బాణ పాలితబాణా
పాత్రీకృతవిధిమస్తక
సత్త్రాశనవంద్యమానచరణాబ్జాతా. 839

మంగళమహాశ్రీవృత్తము.
శ్రీకర నిశాకరణశేఖర యమమూరమణ
సింధుతనయారమణబాణా
పాకపరిపంథిమణిభాగళ మనీషిమణి
బాంధవ పతాబ్ధిమణిభూగా
ప్రాకటశుభాచరణ పన్నగపశాభరణ
భక్తజనతారణ(వి)లోలా
శ్రీధరవాస వరచిన్మయవిలాస హర
సిద్ధనుత మంగళమహాశ్రీ. 840

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావిభవ
యాదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
ధర్మఖండం బనుప్రబంధపరిపూర్తి
స వ మా శ్వా స ము.



# ముఖ్య పాఠ భేదములు

| పుట. | పంక్తి. | పాఠభేదము. |
| --- | --- | --- |
| 482 | 11 | సీ. శునియందు (ప్రతులన్నిట నిట్లే) |
| 577 | 3 | భక్తయశస్క రాయ |
| 674 | 7, 8 | పూజితులగుచు, బాలునకు రెచట |
| 691 | 2 | గాంచిరప్పుడస్వప్న |
| 697 | 10 | ధవళకరవిభాసద్వజ్ర |
| 799 | 17 | చాయన్ డాయుడు |
| 800 | 18 | డించి యూరక |
| 801 | 1 | బ్రిహ్మాస్త్రబాధచే బఱచుక్రతహానురుం |
| 806 | 18 | డించుటకుం బుద్ధి |
| 821 | 10 | యమర్తాత్ర |
| 848 | 4, 5 | రక్తాంతప, ద్విలసత్ |
| 852 | 20 | సుధ వార్త |
| 858 | 12 | మాన పొడలు |
| 862 | 4 | నిరగా వరక్షేవ |

866 వ పుట 800 పద్యమునకుం దిక్రిందిపద్యమున్నది.

తే. గీ. బాల్యకౌమారయౌవనప్రాయ వార్ధ
కములందు నెందెన రామునామము జపింప